అందులో మెల్లకన్నయితే ఎలా వుంటుంది...అబ్బ. చాలాఘోరంగా వుంటుంది. పోనీ అందుకు సొట్ట ముక్కుబొమ్మ ఏమనింది?(బాధతో)

రా: సొట్టముక్కు బొమ్మ ఏం చెప్పిందనికదూ నీవడగటం? "వాళ్లిద్దరూ మమ్మల్ని ఎగతాళిచెయ్యకపోతే చాలు. మేము ఒకరినొకరు వెక్కిరించుకోము. మనుష్యుల్లో వున్న ఆ హేళన చేసే దురభ్యాసం మాకు లేదు" అన్నది.

సు: ఎంత తెలివిగా మాట్లాడింది రాధా ఆ బొమ్మ!

మా: } (ఇద్దరూ విచారంగా
ల: }
నిలుచు నుంటారు)

సు: రాధా! సొట్టముక్కు బొమ్మకు మెల్లకన్నూ, మెల్లకన్ను బొమ్మకు సొట్టముక్కూ చేయడం కన్నా, రెండిటినీ అందంగా తీర్చే యత్నం చెయ్యకూడదూ?

రా: ఆ విషయమే చెప్పవచ్చాను. అప్పుడు ముద్దులతల ముందుకువచ్చి "మీరు ఒకరంటారని విశారాలు చేసుకోవడం దేనికి. ముగ్గురం అందంగావుండడానికి ప్రయత్నించకూడదా?బుద్ధి అన్నిటికయినా ముఖ్యమయినది. అది సొట్టయితే అందరూ అసహ్యించుకుంటారని తెలుసుకోండి. ఎవరికోసమో మనం రూపాలు మార్చుకోడం దేనికి"అన్నది.

సు: ఆ రెండుతలలకూ అందాలు కూర్చావా?

రా: ఆ ముద్దులతల ఆమాటలు చెప్పేసరికి మేము ఎప్పటిలాగే వుంటాము. మాకేం అందం అక్కరలేదు. తెలియకుండా వాళ్ళకోసం ఆవేశపడి మేము మరింత వికారమవడానికి సిద్ధమయ్యాము" అన్నాయి.

ల: పోనీలే! సొట్టముక్కు తలకు మెల్లకన్నూ...

మా: మెల్లకన్నుబొమ్మకు సొట్టముక్కూ చేసేయలేదుకదా? (నిట్టూర్పు విడిచింది)

రా: ఉండండి! నేనేంచేశానో చూపుతా.

(లోపలికి వెళ్ళింది)

ల: }
మా: } (వింతగా ఆ వైపే చూస్తూవుంటారు)
సు: }

రా: (ప్రవేశించి) చూశారా?

ల: అదేమిటి దేనికీ సొట్టముక్కే లేదు.

మా: ఏ బొమ్మకూ మెల్లకన్ను లేదు.

సు: మూడుతలలూ ముద్దుగా వున్నాయే!

ల: మంచిపని చేశావే రాధా.

రా: ఇప్పుడు మూడుతలలూ ముద్దుగొలుపుతూ వున్నాయికదూ!

మా: అవునే.

రా: మా నాన్నకు నిన్న ఈ సంగతి చెప్పాను. ఆయన నేర్పుగా యీ మూడు తలలూ తీర్చియిచ్చారు. వీటిని మీరు తీసుకపోయి, తల లతికించి, రేపు తెచ్చియివ్వండి. వెళ్ళిరండి!

(లలిత; మాలతి; సుమతి; వెళ్లబోతూంటే—)

రా: మాలతీ! ఇలారా! ఏమీ అనుకోవద్దు నీ బొమ్మది మెల్లకన్నుతలకదూ!

మా: ఔను. ఇకనుంచి ఎవరినీ వెక్కిరించను లేవే.

రా: మరి; లలితా!

ల: అడగడమెందుకులేవే బుద్ధిలేక సొట్టముక్కుబొమ్మ నాదికాదన్నాను. ఇప్పుడు బుద్ధివచ్చింది.

సు: రాధా! నీవెలా తెలుసుకున్నావే యిదంతా. నిజంగా ఆ బొమ్మలు మాట్లాడాయా.

రా: ఇదేం బ్రహ్మవిద్యా? వాళ్ళ మాటలుబట్టి గ్రహించాను. ఆబొమ్మలు నాతో మాట్లాడలేదు. నిజంగా ఏ బొమ్మది ఏ తలో నిర్ణయించడానికి మా నాన్న ఇదంతా కల్పించి చెప్పారు. అది మనం ప్రయోగంచేసి చూశాం. ఫలించింది.

సు: మీ నాన్న కల్పనకు నీవు ప్రాణంపోసి, గొప్పచిక్కు తీర్చావు!

మా: వెడతాం. మంచి గుణపాఠం నేర్చుకున్నాం. నమస్తే!

రా: నమస్తే! వెళ్ళిరండి.

(రాధ నిలుచునుండగా అందరూ వెళ్లుతారు.) ★

# విషయానుక్రమణిక





# దసరా పండుగలు ★

వావిలాల సోమయాజులు

భారతీయుల పండుగలన్నీ వారి విజ్ఞాన విశేషాలనూ, సామాజిక జీవితాన్నీ నిరూపించే దర్పణాలనటం నిస్సంశయం. అట్టి విజ్ఞాన విశేషాన్ని, సామాజిక జీవితాన్నీ వ్యక్తం చేసే పండుగల్లో 'దసరాలు' అతి ప్రముఖమైనవి.

ఆశ్వయుజ శుద్ధపాడ్యమి మొదలు ఏకాదశి వరకూ ఉన్న పది దినాలకూ 'దసరా' లని పేరు. ఇందులో పదో నాటిని 'విజయదశమి' అని వ్యవహరిస్తారు. పాడ్యమి మొదలు నవమి వరకూ ఉన్న తొమ్మిది దినాలనూ 'నవరాత్రు' లంటారు. ఈ నవరాత్రుల్లో ప్రధానంగా ఆదిశక్తి అయిన దేవీపూజలు జరగటంవల్ల వీటికి 'దేవీ నవరాత్రా'లని కూడా వ్యవహారం. ఆశ్వయుజ కార్తీకమాసాలు శరదృతువు. శరదారంభంలో దేవీ నవరాత్రాలు ఆరంభించటం వల్ల వీటిని 'శరన్నవరాత్రా'లని ఆంధ్రులు పిలుస్తున్నారు. ఈ పండుగ దినాలల్లో పూర్వ రాజన్యులు 'ఆయుధ పూజలు' చేయటం వల్ల 'ఆయుధ పూజ' అని కూడా ఈ పండుగల్లో కొంత భాగానికి పేరైంది.

మహాద్రష్టలైన మన పూర్వులు ఈ దసరా ఉత్సవాలను సాంకేతికంగా ఒక లయాన్నీ సృష్టిని నిరూపించే ఉత్సవాలుగా ఉద్దేశించినట్లు కనిపిస్తున్నది. భాద్రపద మాసంలో కృష్ణపక్షమంతా పితృదినాలు. ఆ అమావాస్య మహాలయామావాశ్య. పితరులు ఏ తిథినాడు మృతినొందినా ఈ మహాలయామావాశ్యనాడు విడిచిన తర్పణాలు పెట్టిన శ్రాద్ధాలు వారిని చెందుతవని విజ్ఞుల భావన. ఈ మహాలయామావాశ్య ఒక లయానికి సాంకేతిక చిహ్నం. ఈ అమావాశ్యతో అంతమొందిన సృష్టి ఆశ్వయుజ శుద్ధ ప్రథమతో తిరిగి సృజితమౌతుంది. జీవి జన్మించేటంతవరకూ మాతృగర్భంలో వసించే కాలం నవమాసాలు. నవరాత్రులు నవమాసాలకు సాంకేతిక చిహ్నాలు. జీవి పదవమాసంలో జన్మిస్తాడు. అంటే విజయం పొందుతాడన్నమాట. ఆ విజయ చిహ్నమే నవరాత్రుల పిమ్మట వచ్చే విజయదశమి. ఈ సృష్టిశక్తి (Creative energy) ప్రతీక దేవి. ఈ సృష్టిశక్తి పూజనే మనవారు దేవీ పూజగా భావించారు.

జీవుడు మాతృగర్భంలో ఉన్న తొమ్మిది నెలల్లో ప్రతి మూడు మాసాలకూ ఒక అవస్థను అధిగమిస్తాడు. మొదటి మూడు నెలల్లో ఉన్న జలరూపాన్ని గడిచి తరువాతి అవస్థలో ఘనీభావాన్ని పొందుతాడు. ఆరు మాసాలు గడచిన తరువాత అవయవస్ఫూర్తి ఏర్పడి చైతన్యం ప్రవేశిస్తుంది. గర్భనరకాన్ని విడిచి ఆవిర్భవించటమే జీవుని విజయం. జీవి తోటివాళ్ళ అరిష్టాలను తొలగద్రోసుకుని సుఖంగా బ్రతకటం ఆరంభించడమనే ఆనందాన్ని భారతీయులు ఆశ్వయుజ మాసాంతంలో జరుపుకునే దీపావళి మహోత్సవాలతో తెలియజేస్తున్నారు.

దసరా ఉత్సవాల్లో భారతీయుల పూజలను అందుకునే దేవత దేవి, ఆదిశక్తి, పరాశక్తి, అంబ. దేవీభాగవతంలో ఆ దేవిని కవి యిలా కీర్తించాడు.

> "జగములు సృజింప రాజసీశక్తియగుచు,
> జగములు భరింప సాత్త్వికశక్తి యగుచు,
> జగము లణపంగ తామసీశక్తియగుచు,
> నిన్ను వన్నె నా హరునికా నిత్య నంబ"

సత్త్వ రజస్తమో గుణాత్మక ఐన దేవి వివిధ మూర్తులతో విరాజిల్లుతున్నది. దసరా ఉత్సవాల్లో ఆ దేవిని మహాకాళి (తమోరూపిణి) మహాలక్ష్మి (సత్వమూర్తి) మహాసరస్వతి (రజోమూర్తి) రూపాలతో భావించి భారతీయులు పూజిస్తారు.

దసరా ఉత్సవాలూ, దేవీ పూజ భారత దేశంలో ఏనాడు ప్రారంభమైందో నిర్ణయించటం సుసాధ్యం కాదు. దేవీ పూజా విధానాన్ని నిరూపించే కల్పగ్రంథాలు, దేవీ మాహాత్మ్యవిశేషాలను వర్ణించే రచనలూ అనంతంగా ఉన్నవి. అయితే మార్కండేయ పురాణాంతర్గత మని చెప్పబడుతూ ఉన్న 'దేవీ మాహాత్మ్యం' మీద అందరికీ ప్రమాణబుద్ధి ఉంది. అందులో దేవీ మాహాత్మ్యం మూడు చరితలుగా ఉంది. యోగనిద్రలో ఉన్న మహావిష్ణువు కర్ణమలంనుంచి పుట్టిన మధుకైటభులను దేవి మహామాయ (మహాకాళి)గా సంహరించటం మొదటి చరిత. రాక్షసమాత అయిన దితి తన కుమార్తె అపజయానికి చింతించి 'మహిషీరూపంతో' బ్రహ్మను గురించి తపస్సు చేసింది. ఆమెకు మాయావి, కూరుడు అయిన మహిషాసురుడు జన్మించాడు. దుర్నీతిపరుడైన వాడు దేవతల నందరినీ బాధిస్తుంటే నారదుడు ఒక్కొక్కడిగా విష్ణుసందర్శనం చేశారు. దేవతలందరూ విష్ణు సన్నిధానంలో మహిషాసుర సంహారాన్ని గురించి సమాలోచిస్తుంటే వారి శరీరాలల్లోనుంచి తేజోరూపాన వారి అంశాలు బయలుదేరి ఒక సుందరరూపంతో సర్వాభరణభూషిత ఐన 'మహాదేవి' అవతరించి బ్రహ్మాదిదేవతలిచ్చిన వారివారి ఆయుధాలను ధరించి మహిషాసురుణ్ణి సంహరించటం రెండో చరిత. 'సరస్వతీ రూపంతో' శుంభ, నిశుంభుల సంహరించటం మూడో చరిత.

పూర్వం రురుని కుమారుడు దుర్గుడు ముల్లోకాలనూ జయించాడు. అతని శక్తికి తాళజాలక దేవతలు శివుని శరణుజొచ్చారు. శివుడు మహాదేవిని దుర్గుని సంహరించవలసిందని ఆజ్ఞాపించాడు. ఆమె తన అంశామూర్తి అయిన కాళరాత్రిని దుర్గునిమీదికి పంపించింది. కాళరాత్రి దుర్గుని సైన్యాన్ని నాశనం చేసింది. దుర్గుడు కాళరాత్రితో పోరాడుతూ వింధ్య పర్వతం వరకూ వచ్చి అక్కడ దేవిని చూచి మోహించి తన్ను భర్తగా స్వీకరింపుమని కోరాడు. అప్పుడు దేవి క్రూరదృష్టులతో అతని సైన్యాన్ని నాశనంచేస్తే వాడు గజరూపాన్ని ధరించి పోరాడాడు. గజరూపాన్ని సంహరిస్తే మహిష రూపాన్ని ధరించి పోరాడుతుంటే దేవి సహస్ర బాహువులతో సహస్రాయుధాలను గ్రహించి మహిషరూప దుర్గుణ్ణి

# ★ దసరా పండుగలు ★

సంహరించింది. దుర్గుణ్ణి సంహరించటంవల్ల దేవి 'దుర్గ' అయింది.

ఈ దుర్గాపూజ క్షత్రియులకు విశేష ప్రధానంగా కనిపిస్తుంది. సేతుబంధన సమయంలోనూ, రావణునితో యుద్ధారంభ సమయంలోనూ, శ్రీరామచంద్రమూర్తి దుర్గాపూజ చేసినట్లు రామాయణంలోనూ, అజ్ఞాతవాస సమయంలో ప్రతిభంగం కాకుండా ఉండటానికి దుర్గపూజ చేసి పాండవులు వరం పొందినట్లు భారతంలోనూ కనిపిస్తున్నది. మహాభారత యుద్ధం ఆరంభంకాబోయే ముందు కృష్ణపరమాత్మ అర్జునుడికి దుర్గామాహాత్మ్యాన్ని చెప్పినట్లు సంస్కృత మహాభారతము భీష్మపర్వము వలన తెలుస్తున్నది. నవరాత్రులలో ఆశ్వయుజ శుద్ధ అష్టమికి 'దుర్గాష్టమి' అని పేరు.

భారతదేశంలో దేవీపూజ వివిధ ప్రాంతాల్లో వివిధ రూపాల్లో జరుగుతున్నది. కొన్ని ప్రాంతాల్లో దేవిని చండీ, కాళీ, కాళరాత్రి మొదలగు రూపాలతో ఆహ్వానించి ఉగ్రమైన పూజావిధానాన్ని అనుసరిస్తారు. కొన్ని ప్రాంతాల్లో ఆమెను సౌమ్యమైన పూజావిధానంతో అర్చిస్తారు. నవరాత్రుల్లో ముఖ్య విధులు తొమ్మిదిగా కనిపిస్తున్నవి. (1) కలశస్థాపన (2) దేవతాపూజ (3) సప్తశత్యాది జపము (4) అఖండ దీపము (5) మాలాబంధము (6) ఏకభుక్తాది నియమాలు (7) సువాసినీ భోజనము (8) కుమారీ భోజనము (9) హోమాదికాలు.

రెండేండ్లు మొదలుకొని పన్నెండేండ్ల వరకూ ఉన్న కుమారికలను వరుసగా కుమారి, త్రిమూర్తి, కళ్యాణి, రోహిణి, కాళిక, చండి, శాంభవి, దుర్గ, సుభద్ర అనే నామాలతో పూజించి వస్త్రాభరణ భోజనాలతో తృప్తిపొందించటం కుమారీ పూజ.

దేవీ పూజకు వివిధ కల్పాలున్నవి. (1) నవమ్యాది కల్పము (2) ప్రతిపదాది కల్పము (3) షష్ఠ్యాది కల్పము (4) సప్తమ్యాది కల్పము (5) అష్టమ్యాది కల్పము (6) అష్టమీ కల్పము (7) నవమీ కల్పము. ఈ కల్పాలల్లో ఏదో ఒక కల్పాన్ని అనుసరించి వారి 'కుల' సంప్రదాయాలననుసరించి దేవిని పూజించి, సాత్త్విక, రాజసిక, తామసిక రీతుల్లో 'నివేదన' చేస్తారు. సాత్త్విక మార్గాన్ని అనుసరించేవారు 'ఇక్షురసము'ను రాజసిక తామసిక మార్గాన్ని అనుసరించేవారు, సురాది మద్యాలను అమృతంగా దేవికి అర్పించి "సుధాపాత్ర మిదం దివ్యం, దీయతే ఫలసంయుతమ్, స్వీకృత్య వరదే దేవి జయం దేహి రిపూన్ దహ," అని ప్రార్థిస్తే, దేవి "వత్స తుభ్యమ్ మయా దత్తమ్ పీతశేషమ్ కులామృతమ్, తవ శత్రూన్ హరిష్యామి సర్వాభీష్టాన్ దదామి తే" అని సమాధానం చెపుతుంది. దేవిదత్తమైన అమృతపాత్రను ఆ కులంలోని సామితేయులందరూ ఎంగిలి లేకుండా తాగుతారు. తామసిక మార్గాన్ని అనుసరించేవారు పశుబలులిస్తారు. రాజసికంలో కూడా మాంసం ఉంటుంది. కొందరు వామాచారులు కులార్ణవాది తంత్రగ్రంథాలలోని విరుద్ధాచారాలను అనుసరిస్తూ తప్పతాగి మైథునాది గుప్తాచారాలను అనుసరిస్తారని తెలుస్తున్నది. రాజసిక తామసిక ప్రవృత్తులతో దేవిని ఉపాసించేవారికి సప్తమ్యాది కల్పం ప్రమాణం, వారికి తుది మూడు దినాలే ప్రధానం. మూలలో దేవిని ఆహ్వానించి 'శ్రవణం'లో విసర్జిస్తారు.

దక్షిణదేశంలో దేవీపూజ ప్రతిపదాది కల్పాన్ని అనుసరించి జరుగుతుంది. ప్రధానదేవతామూర్తిని కాళీ, చండికా రూపాల్లో కాక దాక్షిణాత్యులు మహాలక్ష్మిగా భావిస్తారు. అష్టమి, దశమి రెండు దినాల్లో సరస్వతీపూజ చేస్తారు. మహార్నవమినాడు లక్ష్మిని ధన, ధాన్య, వస్త్ర, వృత్తికి సంబంధించిన ఉపకరణ రూపాల్లో అర్చిస్తారు.

ప్రతిపదాది కల్పాన్ని అనుసరించి ఆశ్వయుజ శుద్ధపాడ్యమినాడు కలశస్థాపన జరుగుతుంది. విదియనాడు దేవికి కేశబంధనము, తదియనాడు దర్పణప్రదానము, సిందూరదర్ప, లాక్షారసాలంకరణము మొదలైనవి చేస్తారు. చవితినాడు మధుపర్కప్రదానము, నేత్రాలంకరణము, షష్ఠినాటి సాయంకాలం బిల్వతరుబోధనం జరుగుతుంది. ఉపవాసము, అష్టశక్తిపూజ, నవమినాడు ఉగ్రచండీపూజ, బలిదానాదులూ, కుమారీపూజ జరగవలెనని కొన్ని కల్పాలు చెబుతున్నవి. దశమినాడు పూజానంతరం మధ్యాహ్నం మంగళవాద్యాలతో దేవిని సువాసినులంతా నీళ్లలో కలిపివస్తారు. నదీ జలాలున్నచోట నదిలో వదలివస్తారు. దీనినే 'గౌరమ్మ నీళ్ళాట' అంటారు ఆంధ్రలో ముత్తైదువలు.

"విజయ దశమి" దసరా ఉత్సవాలకు తుది పండుగనాడు, పూర్వకాలంలో హిందూరాజులు విక్రమాదిత్యుడు, కృష్ణదేవరాయలు మొదలైనవారు నవరాత్రుత్సవాలకుగాను రాజసౌధాల్లో కళాకుశలులైన కర్మకారులచేత రమ్యమైన వేదికను నిర్మింపజేసేవారు. ఆ వేదికమీద క్షత్రనరోచితాలైన ఛత్రచామరాదులు, ఆయుధాలు నిలిపేవారు. ఆ వేదికమధ్యలో ఉన్న అగ్నికుండంలోనికి ఆయుధ దేవతలను ఆహ్వానించి పాయస హోమాదులు చేసేవారు. నవరాత్రులన్నినాళ్ళు సాయంకాలాల్లో విద్వద్గోష్ఠులు, మల్లయుద్ధాది క్రీడల ఏర్పాటు చేయించి విద్యావినోదాలతో గడిపి అందందు ప్రజ్ఞానిధులైనవారిని తగిన రీతిగా చందన తాంబూలాదికాలతో సత్కరించేవారు.

విజయదశమినాడు పూర్వ రాజన్యులు చేసే కర్మల్లో 'లోహాభిసార' మొకటి. పూర్వం లోహుడనే రాక్షసుడు దేవతల మీదికి దండెత్తి రాగా వారు కోపించి అతణ్ణి ముక్కలు ముక్కలుగా త్రుంచి విసిరేశారట! ఆ ముక్కలే నేడు ఆయుధాలకు ఉపకరించే లోహాలు. లోహరాక్షసుని శరీరభాగాలైన ఆయుధాలు పైన చెప్పిన అభిసార కర్మవల్ల మొక్కపోవని నమ్మకం. ఆయుధపూజ పూర్తి అయిన తరువాత—యిది అష్టమి నవమి దశమి ఉదయం జరుగుతుంది—పూర్వపు రాజులు సైన్యాలలో గజాశ్వాలను అధిరోహించి ముఖ్యనగరం ఈశాన్య దిక్కుగా ఉన్న శమీవృక్షం దగ్గరకు 'శమీ పూజ' చెయ్యటానికి వెళ్తారు. ఈ ఆచారానికి అవశిష్ట రూపంగా కనిపించే నేడు ఆంధ్రదేశంలో పిల్లలు పట్టే విల్లనంబులూ, జమ్మి కొట్టటము మొదలైన ఆచారాలు.

శమీ వృక్షందగ్గిరకు వెళ్ళిన తరువాత ముందు 'అపరాజితాదేవి' పూజచేస్తారు. ఆమె దుర్గాదేవికి ఒక మూర్తి. ఒక అష్టదళపద్మాన్ని ఉంచి ఆమెకు దక్షిణ వామభాగాల్లో 'జయ, విజయ'లను నిల్పి అపరాజితను కొలుస్తారు.

'శమీ పూజ' సందర్భంలో పూర్వ రాజన్యులు 'శమీ శమయతే పాపం శమీ శత్రువినాశనీ, అర్జునస్య ధనుర్ధారీ, రామస్య ప్రియదర్శని' అని స్తుతిస్తారు. తాము ప్రతిష్ఠించిన జమ్మి పాదులో నీరు పోసి తిరిగివచ్చేటప్పుడు అందున్న మృత్తిక పూజాక్షతలను శిరస్సుమీద ధరించి తిరిగి వస్తారు. తరువాత పొలిమేర దాటేటంత వరకూ సైన్యాలతో వెళ్ళి అక్కడ శంఖధ్వానాదికాలు చేసి, బాణప్రయోగ కౌశలాన్ని ప్రదర్శించి వస్తారు. దీనికే సీమో

ల్లంఘన మని పేరు. పూర్వం శత్రువుల మీదికి యుద్ధానికి వెళ్ళటం శరత్తులో జరిగేది. ఇందుకు మన సాహిత్యంలో ఎన్నో నిదర్శనాలు కనిపిస్తున్నవి. శరత్తులో ముఖ్యంగా విజయదశమినాడే సీమోల్లంఘనం చేసి దండయాత్రకు వెళ్ళితే విజయం తథ్యమన్న అభిప్రాయం పూర్వ క్షత్రియులకు గాఢంగా ఉన్నట్లు కనిపిస్తుంది.

దుర్గాదేవి చాముండి రూపంతో మహిషాసురుణ్ణి విజయదశమినాడు సంహరించి విజయం పొందింది. శ్రీరామచంద్రుడు రావణుని విజయదశమినాడు సంహరించాడు. ఈ విజయదశమినాడే అర్జునుడు ఉత్తర గోగ్రహణ సందర్భంలో ఎక్కటి వీరుడై కౌరవ సైన్యాలను జయించాడు. నవమాసాలు తల్లి గర్భంలో ఉండి పదిళ మాసంలో జన్మించటంవల్ల (విజయం పొందటంవల్ల) ఆ పదో మాసానికి సాంకేతిక చిహ్నమైన దశమి విజయదశమి ఐంది. అందువల్ల విజయాభిలాషులు జిగీషులు ఐన పూర్వ రాజన్యులకు 'విజయదశమి' ప్రధానోత్సవ దినమైంది.

విజయనగరరాజుల కాలంలో నవరాత్ర్యుత్సవాలు మహా వైభవంగా జరిగేవట! అక్కడికి ఆ కాలంలో వచ్చిన విదేశయాత్రికులు పియాజ్, న్యూనిజ్, మొదలైనవారు వాటిని తమ యాత్రా గ్రంథాలల్లో విపులంగా వర్ణించారు. ఆ ఉత్సవాల అంతరార్థం వారికి తెలియకపోయినా ఆనాడు రాజులు ఆచరించిన బాహ్యాచారాలను తెలుసుకోటానికి వారి రచనలు మనకెంతో తోడ్పడుతున్నవి. ఆనాడు దసరా ఉత్సవాల నాటికి సామంతరాజులు వారి కప్పాలను తీసికొని ముఖ్య నగరానికి వచ్చేవారట. వెంట తమ తమ సైన్యాలను, ఇతర వస్తు విశేషాలనూ తెచ్చేవారట!

మహమ్మదు ఘజనీ వెంట భారతదేశానికి వచ్చిన అల్బెరూని ఉత్తరదేశంలో నవరాత్ర్యుత్సవాలను చూచి ఉంటాడు. అతనికి పండుగలు ఏమీ అర్థమైనట్లు కన్పించదు. తన గ్రంథంలో నవరాత్రినిగురించి "ఆశ్వయుజ మాసంలో అష్టమినాడు చంద్రుడు పందొమ్మిదవ నక్షత్రంతో కూడిఉన్నప్పుడు చెఱుకురస పానకపు పండుగ వస్తుంది. ఆ పండుగ మహాదేవుని చెల్లెలైన మహానవమికి చాలా ప్రీతికరమైంది. అప్పుడు భగవతికి వారు (భారతీయులు) ఇక్షురసాన్ని తొలుత అర్పిస్తారు. అంతకుపూర్వం అనేక దానాలు చేస్తారు; గొఱ్ఱెపిల్లలను బలిఇస్తారు. తన దగ్గర ఏమీ దేవికి అర్పించటానికి లేని దరిద్రుడు భగవతి విగ్రహం ప్రక్కన నిలబడి చూచిచూచి ఎదట ఉన్నవాడి మీదపడి వాణ్ణిచంపి దేవికి బలిఇస్తాడు" అని వ్రాశాడు. [పుట 180 అల్బెరూనీస్ ఇండియా. వాల్యూం 11]. విజయనగర రాజుల కాలంలో విజయదశమినాటి ఉత్సవాలు 'మహార్నవమి దిబ్బ' ముందుజరిగేవి. మహానవమినాడు చక్రవర్తి తనకనకసింహాసనాన్ని ఆ వేదికమీదనిల్పి, సామంతులు తెచ్చి ఇచ్చిన ధనరాసులను, తన సమస్త కోశాన్ని రాసులుపోసి పూజించేవాడు. విజయనగర చక్రవర్తి అచ్యుతరాయ

# ★ దసరా పండుగలు ★

లకాలంలో (క్రీ. శ. 1530-1542) వచ్చిన న్యూనిజ్ అనే పోర్చుగీస్ యాత్రికుడు దసరా ఉత్సవాలను రమ్యంగా చిత్రించాడు. అతని వర్ణన యీ విధంగా ఉంది:

"ఈ ఉత్సవం (మహానవమి) నవరాత్ర్యుత్సవాల్లో సెప్టెంబరులో వస్తుంది. మా ప్రకృతిమాత తన గర్భంలో తన కుమారుణ్ణి నవమాసాలు మోసినదానికి సూచకంగా మేమీ పండుగలు జరుపుకుంటాం అని కొందరంటారు. ఈ కాలంలో సామంతులంతా కప్పాలు చెల్లించటానికి వస్తారుగనుక మేము ఈ ఉత్సవాలు చేసుకుంటాం అని కొందరంటారు... మొదటిరోజు తొమ్మిది నాయంకరాల నాయకులు (మాండలికులు) చక్రవర్తి సౌధంముందు తొమ్మిది సౌధాలను రమణీయంగా నిర్మిస్తారు. విలువైన వస్త్రాలు వేలాడదీస్తారు. వాటిల్లో అందగత్తెలైన నాట్యకత్తెలు ఇతర రమణీయ వస్తువిశేషాలు ఉంటవి. వీరే కాక ఇతర నాయకులు కూడా ఈ ఉత్సవాలకు తమ సౌధాలను నిర్మించి తీరాలి. వీటిని చక్రవర్తికి చూపించాలి. ఒక్కొక్క నాయకుడు తన సౌధాన్ని ప్రతిదినమూ నూతన (చిత్ర నాట్యాది) విశేషాలతో ప్రభువుకు చూపించాలి. నగరపాలకులు రాత్రుల్లో ప్రతినిత్యమూ వచ్చి ఉత్సవదినాలు తొమ్మిదిరోజులూ తమ సౌధాల్లో విశేషాలు ప్రభువుకు చూపించాలి. తొమ్మిది దినాలు పశుబలి విందులు జరిగించేవారు. మొదటిదినం తొమ్మిది గుర్రాలు, తొమ్మిది గొర్రెలు, తొమ్మిది మేకలను బలి ఇస్తారు. ఈరీతిగా తొమ్మిది దినాలు ఆ సంఖ్యలను రెండింతలు చేస్తూ జంతుబలి జరిగేది.

జంతుబలి అయిన తరువాత తొమ్మిది అశ్వాలను తొమ్మిది గజాలను కుంచీలతోనూ, మంచి వస్త్రాలతోనూ అలంకరించి చక్రవర్తిముందుకు తీసుకొస్తారు. వాటి ముందుగా అశ్వాధ్యక్షుడు, గజాధ్యక్షుడూ వచ్చి ప్రభువుకు వందనంచేసి వెళ్ళిపోతారు. తరువాత పురోహితులు లోపల నుంచి వచ్చి అక్షతలు, ధూపములు, పవిత్రజలము, అగ్నులతో వేదికమీద నిలబడి ప్రార్థనచేసి గుర్రాలను, గజాలనూ అభిషేకిస్తారు. కుంకుమ గుర్తులు వాటి శిరస్సులమీద ఉంచుతారు. ఇది జరుగుతున్నంతసేపూ చక్రవర్తి మణులు పొదిగిన బంగారు సింహాసనంమీద కూర్చొని చూస్తుంటాడు. చక్రవర్తి ఇప్పుడు తప్ప ఆ సింహాసనంమీద సంవత్సరం మొత్తం ఎప్పుడూ కూర్చోడు. ఆ సింహాసనంమీద కూర్చునే వ్యక్తి సత్యవంతుడుగా ఉండాలి. ఇప్పటి చక్రవర్తి ఎప్పుడూ కూర్చోడు. ఈ పూజ జరుగుతున్న సమయంలో సర్వాలంకార భూషితలైన వేయిమంది వేశ్యలు సుందరమైన నాట్యభంగిమల్లో పాదనాలనం చేస్తూ సాగిపోతుంటారు. ఇలా అనేక కర్మలు గడిచిన తరువాత పట్టువస్త్రాలతో, బంగారు ఆభరణాలతో, వివిధ శిరోరత్నాలతో అలంకరించబడిన గుర్రాలు, గజాలు, ఎద్దులు, ఒంటెలు) రాజసౌధంముందునుంచీ వెళ్ళిపోతాయి.

తరువాత చక్రవర్తి ముఖ్య భార్యల్లో సుందరమైన ముప్పది ఆరుమంది కేశవేశాలు చేతుల్లో బంగారు పాత్రల్లో దీపాలను వెలిగించుకొని వరుసగా వస్తారు. వారి వెంట ఇతర భార్యలు దాసీజనము బంగారు పాన్పుల వేత్రాలతో (బెత్తాలు)నూ, నేతి కాగడాలతోనూ వస్తారు. కేశపాశాలు కరీగాని, ముత్యాల ఆభరణాలతో బంగారు, రంగుల అలంకరించుకొని వస్తారు. కుడకు అంతా చక్రవర్తితో కలిసి రాజసౌధంలోకి నిష్క్రమిస్తారు. అతని వెంట నడిచే స్త్రీలంతా నవరత్నాలవంత దటంగా బంగారంతో రత్నాలతో అలంకరించుకుంటారు.

ఈ నవరాత్ర్యుత్సవాలు తొమ్మిది దినాలు రాజుగారికి ఆనందాన్ని కలిగించే వస్తువులను వివిధవిశేషాలనూ వెదికి చూపించటంలో ప్రజలు, సామంతులు నిమగ్నులై ఉంటారు. ఈ ఉత్సవాలకు వేయిమందికి తక్కువ లేకుండా మల్లులు వచ్చి బలప్రదర్శనం చేసి చక్రవర్తివల్ల సన్మానాలను పొందుతారు."

న్యూనిజ్ వర్ణించినది విజయనగరరాజుల నాటి ఉత్సవాల్లో ఒక భాగం మాత్రం. వేదశాస్త్రకళాది ప్రజ్ఞావిశేషాలు పరీక్షించి గౌరవించటం ఆనాడు మహోఘనంగా జరిగి ఉంటుంది. ఆ రాజన్యులు పెట్టిన ఒరవడి ఆచారమై తరువాత కాలంలో చిల్లరసంస్థానాధీశ్వరులు కూడా నవరాత్ర్యుత్సవాల్లో విద్యాగౌరవం సాగిస్తూ వచ్చారు. ఒకనాటి సీమోల్లంఘనము, ఆయుధపూజ నేడుపిల్లలు పట్టే విల్లంబుల్లో వాసనలు నిల్చివున్నట్లే, ఆనాటి ఆచారాలు కొన్ని బొమ్మలకొలువుల్లోనూ, దేవాలయాల్లో దేవి వివిధ రూపాలను మట్టితో తీర్చి రంగులు దిద్దటంలోనూ, దీపాదికాలలోనూ, సామాన్య కుటుంబీకులు సంస్కారులను సత్కరించటంలోనూ, పోలేక ప్రాణం నిలుపుకుంటూ వస్తున్నవి.

వేదాంతి మొదలు పసిపిల్లలవరకూ ఈ పండుగల్లో స్థానం కల్పించి మన పూర్వులు దసరా పండుగలను తీర్చిదిద్ది సామాజిక జీవితాన్ని ప్రాచీనకాలంలో బహుముఖాలా వీనిలో కేంద్రీకరించారు. అయితే ప్రధానంగా దసరా ఉత్సవాలు ఒకలయానంతరం సృష్టిని సూచించే సాంకేతికసంజ్ఞలనటం నిస్సంశయం. ఈ భావం పూర్వం సామాన్యజనానికి కూడా అర్థమై ఉండటంవల్ల న్యూనిజ్ వంటి విదేశయాత్రికుడు కూడా గమనింపకలిగి తన గ్రంథంలో "Some say that they do this in honour of the nine months during which OUR MOTHER bore her SON in the womb" అని వ్రాసినాడు.

"సర్వ చైతన్య రూపాం తాం,
ఆద్యాం విద్యాంచ ధీమహి,
బుద్ధిం యానః ప్రచోదయాత్." ★

# ఆంధ్రపత్రిక

## సచిత్ర వారపత్రిక

## సంక్రాంతి సంచిక

# కథానికల పోటీ

**మొదటి బహుమతి రు. 75 రెండవ బహుమతి రు. 50.**

## రచనలు చేరవలసిన ఆఖరుతేది 10-12-55

ఆంధ్రపత్రిక - సచిత్ర వారపత్రిక 1956 సంక్రాంతి ప్రత్యేక సంచిక ప్రచురణ పురస్కరించుకుని కథానికా రచనకు ప్రోత్సాహమివ్వవలెననే ఉద్దేశంతో పోటీ జరపాలని నిశ్చయించాము.

పోటీకి వచ్చే కథానికలలో శ్రేష్ఠమైన రెండు రచనలకు రు. 75, రు. 50 బహుమతులివ్వబడతాయి.

సామాజిక ఇతివృత్తాలుగల స్వతంత్ర రచనలే పోటీకి స్వీకరించబడతాయి.

పోటీ కథానికలు మా కార్యాలయానికి 1955 డిసెంబరు 10 వ తేదీలోగా చేరాలి.

బహుమతుల గురించిన తుది నిర్ణయాధికారం సంపాదకులకే ఉంటుంది.

పోటీకి పంపే కథానికలకు రేపర్లపైనా, రచన మొదటి పుట పైనకూడా స్పష్టంగా "ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రిక సంక్రాంతి కథానికల పోటీకి" అని వ్రాయాలి.

రచనలు తెల్ల కాగితాలలో సిరాతో ఒకే వైపున వ్రాసి పంపాలి.

బహుమతి నిర్ణయం అనంతరం ప్రచురణకు స్వీకరించబడని రచనలను త్రిప్పి పంపగోరే రచయితలు తమ రచనలతో పాటే తిరుగు పోస్టుకు అవసరమైన స్టాంపులు జతపరిచి పంపాలి.

సంక్రాంతి సంచికకు గాను ఇతర వ్యాసాలు, కథానికలు, చిత్రాలు, ఫొటోలు పంపదలచిన వారు కూడా 1955 డిసెంబరు 10 వ తేదీలోగా మా కార్యాలయానికి అందేటట్లు పంపాలి. చిత్రాలు ఇండియన్ ఇంక్‌లో వ్రాయాలి. ఫొటోలు గ్లాసీ ప్రింట్స్ మాత్రమే; కార్డు సైజుకి తక్కువ కాకుండా ఉండాలి.

రచయితలు ఈ సదవకాశాన్ని వినియోగించుకుని మా సంకల్పాన్ని జయప్రదంగా నెరవేర్చగలరని ఆశిస్తున్నాము.

—సంపాదకుడు.

# తలా తోకా ఉన్న కథ

ఆరుద్ర

చదువులేని కత్తి
చమురులేని వత్తి
రెండూ పెండ్లాడిన వొక
ఎండ కాయు రాత్రి

"నా పేరు కత్తి
నా పేరు మిత్తి
నిన్ను ప్రేమించుతా
గుండెలకు హత్తి"

అంటేను కత్తి
విన్నాది వత్తి
అన్నాది వంచిన
తన తల ఎత్తి:

"నా తల నిమురు
నాకివ్వు చమురు
అపుడు పోతుంది
నాలోని కమురు"

చమురులేని వత్తి తన ప్రమిద వీడకున్నా
కాలుజారి చేయికాలి, కన్నీరుకార్చుకన్నా
చదువురాని కత్తిది సదనుల ప్రేముని తెలిసి
ఎదురుచూపు చూస్తూ అది కోరినట్లా మాదిరి.

కత్తి వత్తి
కన్ను లొత్తి
ఉరోజాలమీద పడిన
శిరోజాల సాక్షిగా
ఎన్నటికీ ఎన్నటికీ ఎన్నటికీ
నిన్నే ప్రేమిస్తానన్నాడంటట.

సడిలేక వచ్చాడు
పిడి ఉన్న సుత్తి
వలచె వీడే తొల్లి
వలదంది వత్తి

[చిరంతన సమస్యే నిరంతర త్రిభుజం
కడలేని సంఖ్యలో కథల కిది ఖనిజం.]

కత్తీ ఇనుమే
సుత్తీ ఇనుమే
వత్తి మట్టుకూ
పత్తి

(పీసెడు ఇనుమూ
పీసెడు దూదీ
రెండిటి పరువూ
ఒకటే బరువు)
కత్తి పీసెడు
సుత్తి పీసెడు
పత్తి మట్టుకూ
పీనం!

సుత్తి కత్తి
నెత్తి మొత్తి
నిలబడక కుస్తీకై
కలబడక దాగుంటే
అత్తరి సుత్తిని చూసి
కత్తి పలికె నిట్లు

"నీ పేరు మురికి
నీ పేరు పిరికి
నిన్ను చంపేస్తా
నీ తల నరికి"

కమనుడైన కత్తికీ
బలవంతుడు సుత్తికీ
హోరుగ జరిగే పోరు
ఘోరము తిలకిస్తూ

బిత్తరి చూపుల వత్తి
భోగున ఏడ్చింది
సుత్తిని నోరారా
చిత్తుగ తిట్టింది.

చేశావు తప్పు
తెచ్చావు ముప్పు
నీ వంటినిండా
పట్టూ తుప్పు"

నడిచిన సమరంలోపల
పిడి ఊడెను సుత్తికీ
పిడి ఊడకముందే తా
దునుమాడెను కత్తిని.

సమరంలో సమసిన అమరవీరుడే కత్తి.
దిక్కులేని వితంతువు చమురులేని వత్తి
చదువులేని కత్తిపోయి చమురులేని వత్తిమిగిలి
మసిరె మసిరె మసిరె మసిరె ముదురు
ఇరులగుత్తి.



# సింహావలోకనం

గేటు దాటుతూండగానే అంతా అదోక రకంగా కొత్తగా కనిపించింది ఆయనకు. ఇంకా లోపలికి వెళ్ళి అంతా పూర్తిగా చూస్తే ఎలాగఉంటుందో!...ఏవి మార్పులు ఎక్కడ ఎక్కడ చేశారో, ఉద్యోగులలో ఏ మార్పులు వచ్చాయో, ఏమీ తనకు తెలియదు. లోపలకివెళ్ళి అన్నీ చూస్తేనేగాని తెలియదు. లోపలికివెళ్ళటం అంటే అంత త్వరగా అవుతుందా?...వయస్సు మీరిందాయె! పోయేవయస్సేగాని వచ్చేదికాదు గదా!...చేతికర్ర సహాయంతో, తీరికగా, అడుగులు లెక్కపెట్టుకుంటూ నడిచివెళ్ళి ఆఫీసుభవనం చేరుకునేసరికి లేదంటే పావుగంట పడుతుంది. అలాగే ఓపికపట్టి ఆ పావుగంట నడిస్తే అప్పుడు ఆఫీసు, అక్కడ గదులు, కుర్చీలు, గుమాస్తాలు, బంట్రోతులు, తను ఇదివరకు కూచున్న కుర్చీ, దానిపైన ఊగిసలాడుతూ తిరిగేపంకా, తనక్రింద పనిచేసే గుమాస్తాలు కూచునే చోటు... ఇవన్నీ కనిపిస్తాయి.... ఇదివరకయితే గేటు దగ్గరనుంచి ఆఫీసులోకివెళ్లి తన కుర్చీలో కూచునేందుకు మూడు నిమిషాలుకూడా పూర్తిగా పట్టేదికాదు. తను కారుమీద గేటుముఖ్యం దగ్గరకి వచ్చేసరికే బంట్రోతులు హాజరుగా ఉండేవారు. కారు భవనంముంగు ఆగేసరికి ఒక బంట్రోతువచ్చి కారు తలుపు తెరచి ప్రక్కగా నిలబడి పట్టుకుంటే తను ఎంతో జాగ్రత్తగా దిగేవాడు. అక్కడినుంచి గది తలుపులు తీయటానికి మరొక బంట్రోతు, కారులోఉన్న రికార్డు తెచ్చేందుకు మరొకడు...వీళ్ళుకాక తను భవనంలో అడుగుపెట్టేసరికల్లా తన కటాక్షవీక్షణాలకోసం కనురెప్ప వాల్చకుండా బారులుతీర్చి కాసుకు నుంచున్న గుమాస్తాలు... ఎంత వైభవంగా ఉండేది?...అలాంటిది ఇవాళ అంటే రిటైరయిన తర్వాత-తను వస్తూంటే కాస్త పలకరించేందుకేనా గేటుదగ్గిర ఎవరూ లేకపోయారు. ఉన్న ముసలి జవానయినా తనని బొత్తిగా గుర్తించనట్టు వాడి పని వాడు చూసుకుంటున్నాడు. ఈ ముసలాడికి ఉద్యోగం ఇప్పించినది తను...సుమారు ఇరవై ఏళ్ళనాడు ఒకరోజు రాత్రి వర్షంలో వచ్చి తన గుమ్మంముందు నోటమాట లేకుండా పడిపోతే అప్పుడు తను చూసి వాడికి కాస్త అన్నంపెట్టి, కట్టుకుందుకు పాతబట్టలిచ్చి వాడి వివరాలు అడిగితే ఎవరూ దిక్కులేరని, ఎవరేనా ఇంత అన్నం దొరికే మార్గం చూపిస్తే వాళ్ల ఋణాన పడి ఉంటానని వాడు అన్నాడు. వాడి కథ విని జాలికలిగి తనే వాడికి ఆఫీసులో పాతిక రూపాయల జీతంమీద పని ఇప్పించాడు. ఆ ఉద్యోగమే వాడు ఇప్పటికీ చేసుకుంటున్నాడు...అయితే అంతలో మరిచిపోయాడా తనని?...ఏమో! తనూ ఈమధ్యన నాలుగేళ్ళయి ఉంటుంది ఇక్కడికి వచ్చి.. వాడా చాలా ముసలాడయిపోయాడు. అందుచేత గుర్తుపట్టలేక పోవచ్చును..అంతే గాని వాడు అలాంటివాడు కాడే!....తను ఆఫీసులో పనిచేస్తూ ఉన్నంత కాలం తనకి కావలసిన విషయాలు యావత్తూ వాడే చూసేవాడు. ప్రతిరోజూ అనేవాడు: "ఇదంతా అయ్యగారు

## మధిర భానుమూర్తి

పెట్టినదే బాబూ" అని. వాడు అలా అంటే తనకి అదోకలా ఉండి, "ఛా! నే చేసిందేముందిరా!...ఉద్యోగం నీకు దొరికి, నువ్వు ఇన్నాళ్లు ఉన్నావూ అంటే అది నీలో ఉంది!" అని. వాడు ఆ మాట ఒప్పుకునేవాడు కాదు. "ఆ రేత్రి మీరు ఆదరించకపోతే నాకు దిక్కెంటి బాబయ్యా!" అనేవాడు. ఆ కృతజ్ఞతతోనే వాడు తనకి సమస్త చాకిరీ చేశాడు. నిజానికి వాడి ఋణం తను తీర్చుకోలేదు.

ఇంతలో వెనకనుంచి ఒక కారు జోరుగా లోపలకి వచ్చింది. తను త్రోవలోంచి కొంచెం ప్రక్కగా తప్పుకున్నాడు. ముసలాడు లేచి నుంచుని కారులో ఉన్నాయనకి నమస్కారం చేశాడు. కారు ముందుకు పోయింది. యాదాలాపంగా లోపల తల తన వేపు తిరిగింది. తనని చూశాడు వాడు. మాస్టాకి నమస్కారం చేసి "ప్రభువులు ఎంతసేపటినుంచి ఇలా నుంచున్నారో!...మందమతోణ్ణి!... చూడలేదు....మన్నించాలి..." అన్నాడు.

"ఫరవాలేదులే!...నీకు కులాసాగా ఉందా!...ఏమిటి ఇక్కడి విశేషాలు..." అని కుతూహలంగా ప్రశ్నించాడు తను.

వాడు తన క్షేమసమాచారం అడిగాడు పిల్లలందరినీ పేరుపేర అడిగాడు. వాటన్నిటికీ తను జవాబులిచ్చాక మళ్ళీ తనే అడిగాడు ఆఫీసు విశేషాలేమిటని...ముసలాడు చాలా తెలివైనవాడు...ఎలాంటివాళ్ళతోనయినా ఇట్టే కాలక్షేపం చెయ్యగలడు. అందుకనే "మీకు తెలియని విశేషాలేముంటాయండి!...ఒకవేళఉన్నా నాకేం తెలుస్తవి?..."అన్నాడు కాస్సేపు పిచ్చాపాటీ మాట్లాడాక వాడిపని వాణ్ణి చూసుకోమ్మ చెప్పి తను ముందుకు బయలుదేరాడు.

ఆ కారులో వెళ్ళినది తను రిటైరయాక ఆ పనిలోకి వచ్చిన రంగనాథం. తను మేనేజరుగా ఉన్నంతకాలం ఈ రంగనాథం తన ప్రాపకంకోసం ఎంత తంటాలు పడేవాడు! సుమారు పదిహేనేళ్ళ పాటు తనక్రింద పనిచేశాడు. ఏ క్షణంలో ఏపని సరిగా చెయ్యకపోతే తనకి కోపం వస్తుందోనని భయపడి చాలా జాగ్రత్తగా పనిచేసుకునేవాడు. అతను చేసిన పనిని తను మెచ్చుకుంటే ఆనాడు ఎంతో సంతోషించేవాడు. చాలా నమ్మకంగా ఉండేవాడు. ఆఫీసు వ్యవహారాలన్నీ అతనికి తెలియనిచ్చినా కాని ఏ భయమూ ఉండేదికాదు. అతని సహాయం ఉండబట్టే తను ఉద్యోగకాలంలో ఆఫీసు ఆమూకే ఏమీ కూడా ఎవరికీ తెలియనిచ్చేవాడు కాదు. అందుచేతే అతనంటే తనకి అభిమానం. ఆ అభిమానంతోనే అతన్ని పైకి తీసుకురావటానికి తను అంతగా ప్రయత్నం చేశాడు. ఇవాళ అతను ఇంత ఆఫీసుకి మేనేజరయాడంటే నిజంగా అతనికి పనంటే ఉన్న శ్రద్ధ, పైఅధికారులంటే వున్న భక్తి ఎంత కారణాలో, తను అతని ప్రమోషను విషయంలో చేసిన సిఫారసులు కూడా అంతే కారణం. లేకపోతే జేరిననాడు చిన్న గుమాస్తాగా ఉన్నవాడు ఇవాళ ఇంతవాడవటం అంటే మాటలా?... అతను కూడా తను చేసిన సహాయాన్ని మరచిపోయేరకం కాదు తను రిటైరయిన నాడు తన గౌరవార్థం ఏర్పాటు చేసిన సభలో ఎంతగా శ్లాఘించాడు తనని!.... అయితే మంచి గడసరి. ఆ మాటల్లో ఎక్కడా పైకి అనకూడని మాటలను అనలేదు. ఏది ఎప్పుడు ఎక్కడ చెప్పాలో, ఏది చెప్పకూడదో...అన్నీ తెలుసును.

# ★ సింహావలోకనం ★

మంచి వ్యవహార జ్ఞానం కూడా ఉంది. కాబట్టే ఇంతకాలంనించీ—తను రిటైరయినప్పటినించీ—ఈ ఆఫీసులో ఉన్న ఆకతాయిపేశంచేత పనిచేయించ గలుగుతున్నాడు...

ఇలా ఆలోచిస్తూ ఆయన ఆ రోడ్డువెంట ఆఫీసు భవనంకేసి వెడుతున్నాడు. ఆ ఆఫీసుకి పెద్దస్థలం ఉంది. ఆ స్థలంచుట్టూ ప్రహారీగోడ కట్టిఉంది. ముందు విశాలమైన స్థలం వదిలి భవనం లోపలగా కట్టారు. ప్రహారీగోడనించి ఆఫీసుభవనం దగ్గిరకి వెళ్ళటానికి ఒక రోడ్డు ఉంది. ఆ రోడ్డు కిరుప్రక్కలా ఉన్న విశాలమైన స్థలంలో పూలతోటవేసి శ్రద్ధగా పెంచుతున్నారు. ఆయన ఆరోడ్డుమీదుగానే నడిచి ఆఫీసు భవనం జేరుకున్నారు.

ఆయన భవనందగ్గిరకి వచ్చేసరికి "నమస్కారం బాబూ!" అన్నాడు ఒక ఇరవైఏళ్ళ కుర్రాడు. నిక్కరు, పొట్టిచేతుల చొక్కా తొడుక్కున్నాడు. ఆగొంతు ఇదివరకు విన్నట్టుగా ఉందిగాని వెంటనే గుర్తుపట్టలేకపోయాడు. "ఈ అబ్బాయి ఎవరా?" అని ఆయన ఆలోచించుకుంటుండగా "నేనండీ! ... అప్పన్నని..." అన్నాడు ఆ అబ్బాయి. "ఓ! ! నువ్వటోయ్! అప్పుడే ఎంతవాడవయావ్! ..' అన్నాడు ఏగాదిగా చూస్తూ. ఇదివరకు "ఒరే! అప్పిగా!.." అని పిలిచేవాడు. ఇవాళ అప్రయత్నంగా "ఏమోయ్!" అన్నాడు. అలా అవినందుకు తనలో తనకే ఆశ్చర్యం వేసింది. అయితే నేం? వయస్సునుబట్టి అప్పన్నను పిలవటంలో ఆమాత్రం మార్పు తప్పకుండా రావాలని తనుకూడా తీర్మానించుకున్నాడు. తను రిటైరయేనాటికి అప్పన్నకి పదిహేనేళ్ళయినా పూర్తిగా లేవు.. బాగా కుర్రతనంగా ఉండేవాడు. తన ఇంట్లో పెపని అంతా చేసిపెట్టేవాడు. ఏదేనా మిగిలితే వాడిచేతిలోకూడా కాస్త పెట్టేవారు తన ఇంట్లో. అమాత్రానికే ఆశపడి ఏపనిచెప్తే ఆపనిచేసేవాడు. ఏపనీ లేనప్పుడు పిల్లలని ఎత్తుకుని ఆడిస్తుండేవాడు. మంచి నిజాయితీగా ఉండేవాడు చిన్నప్పుడే. అందుకనే తప్పనిసరిగా ప్రతి పండగకీ తన పిల్లలతోపాటు వాడికికూడా బట్టలు కుట్టించేవాడు తను. అలాంటి అప్పన్నలో ఎంత మార్పు వచ్చింది!...నిలువెత్తు మనిషయాడు. మనిషిలో ఇదివరకటి కుర్రతనం మాయమయింది. ఇప్పుడు మంచి హుందావచ్చింది. కాని వినయం మాత్రం తగ్గలేదు. వయస్సు వస్తే సుగుణాలు పోయాయా ?'... అలా ఎప్పుడూ పోవు.. అది మనిషినిబట్టిఉంటుంది.

"నీకు పెళ్ళయిందా!..."అని అనుకోకుండానే ప్రశ్నించాడు. తీరా పైకి అనేశాక "ఇలా ఎందుకు అడిగానా!" అనిపించింది. కాని ఇంక చేసేదేముంది?...

"లేదండి!..." అన్నాడు ముసిముసిగా నవ్వుతూ. ఈపాటికి పెళ్లి అయిఉంటుందని తను ప్రశ్న వెయ్యటంవల్ల అప్పన్న జవాబు కొంచెం ఆశ్చర్యాన్ని కలిగించింది.

"మరి మీ మామకూతురుంది అని అనేవాడు మీ నాన్న!..."ముఖంలోకి చూస్తూ అడిగాడు తను.

"ఉందనుకోండి!...దానికి నాలుగొందల రూపాయలు నగలకిమ్మంటున్నాడు మా మామ...అదే చూస్తున్నాం. అవ్వి పోగవటంతోటే..." అని చిరునవ్వు నవ్వాడు.

"అయితే ఆ ప్రయత్నంమీదే ఉన్నావన్నమాట!..." తను మళ్లీ అడిగాడు.

"ఇంకొక ఏభైరూపాయలు కావాలండి! మిగిలిన వెలాగో సంపాదించాను..." అర్ధోక్తిలో ఆపాడు.

"అయితే ఆ ఏభై నేను ఇస్తాను... పెళ్ళి చేసుకో!..." అన్నాడు తను...

అప్పన్న ముఖం సంతోషంతో ప్రకాశించింది. ప్రభువుల దయ..." అన్నాడు.

తనకి ఎంతో ఆశ్చర్యమైంది ఇదివరకెన్నడూ అప్పన్నతో ఆమాటకొస్తే ఎవరితోనూ తను ఇలాంటి ప్రసంగం చెయ్యలేదు. అంతేకాదు...ఇంత చనువుగా మాట్లాడలేదు. మరి ఇప్పుడిలాగ మాట్లాడటం ఎలా జరిగిందా! అని ఆశ్చర్యంగా ఉంది తనకే. అయితే ఇదివరకటికీ, ఇప్పటికి తన స్థితిలో మార్పు వచ్చింది. ఇదివరకు తను ఒక అధికారి. వీళ్లంతా తనకింద పని చేసేవారు. అందుచేత వాళ్ళని కొంచెం అదుపులో పెట్టాలని అభిప్రాయపడి వాళ్ళతో ముభావంగా మాట్లాడేవాడు. కాని ఇప్పుడు ఆబాధలేదు. తను వాళ్లతో చనువుగా మాట్లాడితే తన నైతిక ఎక్కౌరకి భయంలేదు. అందుచేతే ఇలాంటివిషయాలు వాళ్ళతో స్వేచ్ఛగా మాట్లాడగలిగాడు. ఇదంతా తను ఆలోచించుకోకుండానే ఈ మాటలు పైకి అన్నాడు. అంటే ఈ ఆలోచన అంతా తనకు తెలియకుండా లోపలే జరిగిందన్నమాట. కొన్ని కొన్ని విషయాలు అలాగే జరుగుతూంటాయి. ఆ పని మనం చేస్తున్నామని మనకి తెలియనే తెలియదు. కాని చేసేస్తుంటాము.

ఇలా ఆలోచిస్తూండగా "ఏమండోయ్!...చాల రోజులకి వచ్చారే ఇటుకేసి!..." అన్నాడు రంగనాథం

"ఆ!...మరే.. ఏమీతోచక... పోనీ ఒకసారి చూచిపోదామని వచ్చాను" అన్నాడు.

"రండి! లోపలకి - కూచుందురుగాని.." అని ఆహ్వానించాడు రంగనాథం.

ఇందాకా కారులో వెడుతూంటే రంగనాథాన్ని సరిగా చూడలేదు. ఇప్పుడు దగ్గరగా చూస్తే రంగనాథంలో చాలా మార్పు కనిపించింది ఇదివరకు తాను అధికారి, రంగనాథం తన క్రింది గుమాస్తా. అందుచేత ఎప్పుడూ కొంచెం వినయంగానే ఉండేవాడు. తను పిలిచేసరికి హాజరయేవాడు. ఏపని చెప్తే ఆ పని వెంటనే చేసేవాడు. తనకి ఆఫీసులో అన్ని పనులలోను చేదోడువాదోడుగా ఉండేవాడు అలాంటి ఇవాళ తనని లోపలికి ఆహ్వానించి ఇదివరకు ఎన్నో ఏళ్లుగా తను కూచున్న కుర్చీలో కూచుని తనని ఎదురుగానున్న

కుర్చీలో కూర్చునని చెప్పాడు. ఆ చెప్పటంలో ఒక విధమైన హుందా ఉంది. ఇదివరకటి నమ్రత ఎక్కడా కనిపించలేదు... తనకి అలా అనిపిస్తోందిగాని ఇప్పుడు అలాగ ఎందుకుండాలి? అతనూ ఒక ఆఫీసుకు అధికారి. తన అంతటివాడు అయాడు. స్వతంత్రుడు. ఆఫీసులోనున్న వాళ్లందరితో సర్దుకు రావాలి. ఎందరిచేతో పని చేయించాలి. ఎన్నిరకాలవాళ్లుంటారు? వాళ్ళందరినీ ఒక పద్ధతిలోకి తీసుకువచ్చి అందరిచేతా సరిగా పనిచేయించటం మాటలా?... ఇదివరకు తను ఎరుగున్న మేళం కాదూ - ఇది! అక్కడ ఉన్నవాళ్ళంతా యోధాన యోధులు రథాన రథికులు. ఎవ్వడూ తక్కువ తిన్నవాడు కాదు. అంతా కుక్క, పిల్లి, ఎలక, పాము, కప్ప అన్నట్టుంటారు. ఒకడికి మరొకడికీ పడదు. క్షణంసేపుకూడా కలిసి మెలిసి ఉండలేరు. ఎవరిమట్టుకు వాళ్లే మిగిలినవాళ్లకన్న ఎక్కువ ప్రాపకాన్ని అధికారులదగ్గర సంపాదించటానికే ప్రయత్నంచేసేవారు. ఇది వాళ్ళకి పుర్రెన పుట్టిన గుణం. అందుచేత ఒకపట్టాన వదలరు. ఇప్పటికీ వాళ్లు అలాగే ఉండి ఉంటారు. ఇలాంటి రకరకాల గుమాస్తాలతో రంగనాథం ఎలా వేగుతున్నాడో గదా!...పాపం! ... ఆ గోపాలం వట్టి బద్ధకస్తుడు. ఎందుకూ ఉపయోగపడడు. విగ్రహపుష్టి. నైవేద్యనష్టి ... అసలు సమయానికి ఆఫీసుకే రాడు. వస్తే అక్కడ ఉండడు. ఉంటే కబుర్లు చెప్పటమే గాని ఏపనీ చెయ్యడు. ఇలా ఉన్నావేమిటి అని అడిగితే జవాబు చెప్పడు. "నిన్ను పైకి రానియ్యనుసుమా!" అని బెదిరించినప్పటికీ ఏమీ లెక్కచేసేవాడుకాదు అంతగా!...

నయానచెప్పినా భయానచెప్పినా కూడా ఏమీ లాభం ఉండేదికాదు. ఎన్నోసార్లు బాగా విసుగొచ్చి ఉద్యోగానికి పనికిరాడని వ్రాసేద్దామా అనుకునేవాడు. కాని చూస్తూ చూస్తూ కడుపుమీద కొట్టలేక అలా చెయ్యలేదు. నిజానికి గోపాలంమీద జాలిచేత కాదు. అతని ఆర్జనమీద ఆధారపడిఉన్న పెళ్లాం పిల్లల ముఖంచూసి ఆగిపోయాడు చాలామాట్లు. లేకపోతే గోపాలంఉద్యోగం ఎప్పుడో ఎగిరిపోయేది...అతను ఎంత నిర్లక్ష్యంగా ఉంటాడో భార్య అంత కుదురైన మనిషి. కాబట్టే ఈ తీరువమనిషితో కాపురం చేస్తోంది. గంపెడు పిల్లల్ని సాకుకు వస్తోంది. వాళ్లు తింటున్నారో, తినటంలేదో...ఏం అవస్థలు పడుతున్నారో ...ఏమీ బయటవాళ్ళకు తెలియనివ్వదు. అంతగుట్టుగా కాలక్షేపం చేస్తోంది...కాని గోపాలానికి పిల్లలంటేమాత్రం చాలాఇష్టం. ఆఫీసులో పనిచేసేటప్పుడుకూడా పిల్లల రంధే. అందుచేతే పనిచేసేవాడుకాదు సరిగ్గా. దీనికితోడు ఎడపిల్లాడిని ఒకడిని తీసుకువచ్చేవాడు ఆఫీసుకి. ఏరోజుకారోజే చాలా బాధగా ఉండేది తనకి. ఎన్నోసార్లు అతనిమీద చెడుగా వ్రాద్దామని కాగితం, కలం తీసుకున్నవాడు అలాగ వ్రాయకుండా ఎల్లాగ ఆగగలిగాడా అని ఆశ్చర్యం వేస్తుంది తనకే! అలాంటి గోపాలంతో ఎలాగ వేగగలుగుతున్నాడో రంగనాథం!

"ఇక్కడికి వచ్చేసరికి వెనకటివన్నీ జ్ఞాపకం వస్తున్నాయి కాబోలు! మీకు!" అని రంగనాథం ప్రశ్న వేశాడు. ఆప్రశ్నతో ఉలిక్కిపడినట్టు అయి ఆలోచన ఆగిపోయింది.

"ఆఁ!...మరే! మరే!..." అని నవ్వాడు. రంగనాథం కాఫీ అందిచ్చాడు. "ఎందుకులే!" అంటూనే తను తీసుకున్నాడు. కొంచెం కొంచెమే త్రాగాడు.

"ఇదంతా మీదయ!.... మీరు పెట్టిన భిక్షే!..." అన్నాడు రంగనాథం. కృతజ్ఞత అతని ముఖంనిండా ప్రస్ఫుటంగా కనిపిస్తోంది.

"ఏమిటో నువ్వల్లా అంటావుగాని. నే చేసిందేమిటి?...నువ్వు ఒళ్లువంచి పనిచేసుకున్నావు.... వచ్చింది ... అన్నింటికన్నా అదృష్టం ప్రధానం. అదృష్టం నీ పక్షాన ఉంది. అందుచేత వచ్చిందిగాని..." అని తను కొంచెం నెమ్మదిగా అన్నాడు. పైకి మర్యాదగా అలా అన్నప్పటికీ లోపల రంగనాథం అన్నమాట తనకి సంతోషం కలిగించకపోలేదు. ఇంకా రంగనాథానికి తనుచేసిన ఉపకారం మరచిపోనందుకు సంతోషించాడు. ఒక్కొక్కడికి ఎంత చిన్న ఉపకారం చేసినా మరచిపోరు. కొందరికి ఎంతలేని ఉపకారాలు చేసినా ఇట్టే మరిచిపోతారు. రంగనాథం అలాంటివాడుకాదు. అందుకే తనకి రంగనాథం అంటే ఇష్టం. ఎవడేనా నెమ్మది ఉంటేనే పైకివచ్చేది. కుదురుకుంపటి లేకుండా ఎగిరిపడేవాడు ఇంకా పైకి వచ్చేదేముంటుంది? అందుకనే పెద్దవాళ్లు చెప్పేనమాటలు ఒకప్పుడు కాకపోతే ఒకప్పుడైనా, వినాలనటం. అలా విననివాళ్ళు తరువాత అనుభవిస్తారు ... తనమట్టుకు తను ఎప్పుడూ ఎంతో జాగ్రత్తగా పనిచేసుకునేవాడు. కాబట్టే తనతో చేరినవాళ్లు ఇంకా క్రింద ఉండగానే తను పైకివచ్చాడు. అందరి ఆదరాభిమానాలు సంపాదించాడు. దేనికేనా కష్టపడటమే ప్రధానం...

ఇంతలో ఏదో ఫైలు పుచ్చుకుని శర్మ రంగనాథం దగ్గిరికి వచ్చాడు. వస్తూనే "ఏం?...తాతగారు వచ్చారే!.. ఇలాగ" అని వెకిలిగా నవ్వాడు. ఆ నవ్వు వినేసరికి ఒళ్లు మండింది తనకి. ఈ శర్మ తన ప్రాపకంకోసం చాలా తంటాలు పడేవాడు. కాని రంగనాథంఅంత పనివాడుకాదు. పైగా అహంభావం ఎక్కువ. అందుకని తను రంగనాథాన్నే సిఫారసుచేశాడు పై ఉద్యోగానికి. అదే అక్కసు వాడికి. అందుచేత సర్కారువాళ్లు తను ఎంతకోరినా రిటైరయాక ఒక్క సంవత్సరమైనా ఉద్యోగం ఇవ్వకపోయేసరికి ఎంతో సంతోషించాడు. తను రిటైరయిన రోజున సరిగ్గా ఇలాగే నవ్వి తనని ఎగతాళి చెయ్యబోయాడు. అయితే - తనకేం లెక్క!..."కాని వీడికి ఇంకా పొగరు తగ్గలేదు!..." అని అడిగాడు రంగనాథాన్ని.

"పొగరేమిటండీ!....ఎవరికి?..." అని భార్య లేపింది ఆయన్ను. అప్పటికి ఆయనకు మెలకువ వచ్చింది.

"ఏమిటండీ!...ఇంకా పొగరు తగ్గలేదా అంటున్నారేమిటి?" తిరిగి ప్రశ్నించింది భార్య.

"ఓ! అదా!...ఏమీలేదు... ఆఫీసుకు వెళ్ళినట్టు కలవచ్చింది. ఆ కలలో విషపు నవ్వు నవ్వుతూ శర్మగాడు కనిపించాడు. వాడిని గురించి రంగనాథాన్ని అడుగుతున్నాను. ఇంతలోకి నువ్వు లేపావు." అన్నాడాయన.

"ఏం అడగడమో! ఏం లోకమో?... మీరు పెట్టిన కేకకి నిద్రలోంచి ఉలిక్కిపడి లేచాను...అదికాదు కాని రిటైరయి అయిదేళ్ళవుతున్నా మీకు ఆఫీసు రంధి వదిలిందికాదు..." నవ్వుతూ అంది ఆవిడ.

"నీకేం తెలుస్తుంది...పాతికేళ్ళు పనిచేశాను ఈ ఊళ్లోనే!...మరి ఎన్ని విషయాలు చూశాను!...ఎందరు మనుష్యులని ఎరుగుదును!...ఇవన్నీ నీకేం తెలుస్తాయి.. నా జీవితమంతా దానికే ధారపోశాను తెలుసా!...అందుకే...

"అబ్బబ్బ!... అన్నీ తెలుసును కాని పడుక్కొందురూ!... అర్ధరాత్రి వేళ!... తెల్లారేక చెపుదురుగాని మీ సేవాతత్పరత!...అసలే నిద్దర పట్టక పట్టక పడితే అది కాస్తా మీరు చెడగొట్టండి...వదిలిపోతుంది...ఎలాగో గాని..." అని ఆవిడ విసుక్కుంది నవ్వుతూనే.

"సరేలే! ...నీకు అలా అనిపిస్తుంది పాపం!... నేనేం చెయ్యను? ... నాకు వస్తున్న చక్కటికల పాడుచేసి పైగా నన్నే అంటున్నావు...తెలివితేటలంటే అల్లా ఉండాలి!..." అని ముసుగుతన్ని పడుక్కున్నాడు ఆయన. ★

# హస్తసాముద్రికం

పంతుల శ్రీరామశాస్త్రి

మే నెల మొదటివారం. ఉదయం పది గంటల వేళ. మద్రాసునుంచి కలకత్తా పోయే మెయిలు రాజమండ్రీ స్టేషనులో ఆగింది.

మామూలు తినుబండారాల అమ్మకం మనుషుల కేకలు తోడు "ఆఁ ఇంకెవరికన్నా పుస్తకాలు కావాలండీ, నవల్సు, నాటకాలు, సినీమాపాటలు, హరికథలు, ఆడవాళ్ల పాటలు, బాలయోగిపాటలు..." అని ఆ వెనుక సుమారు ఒకపాటలాగ ఏర్పరచుకొన్న నవలలపేర్లు ఏకరువుపెట్టే పుస్తకవిక్రేతలగొడవ రేగిన తేనెపట్టును తలపింపజేస్తుంది.

స్టేషనుకి ఇంకా కొంచెందూరంలో ఉండి, మాటిమాటికీ టైము చూసుకొంటూ, లాగే రిక్షామనుషులను, తోలే జట్కాఆసాములను తొందరచేసేవాళ్లకు మరొక్క అయిదు నిమిషాలు మెయిలాగితే, ఇవాళ ఒక్కనాడు ఆగితే చాలును, రేపు పదినిమిషాలు ముందుగా బయలుదేరిపోయినా బాధలేదన్నట్టుంది.

కాని, రైల్లో ఉన్నవాళ్ల ధోరణి వేరు. వాళ్లకి ప్రతిస్టేషనులోనూ ఆగవలసినకంటె చాలా ఎక్కువసేపు ఆగిపోయినట్టనిపిస్తుంది. అందులోనూ దూరప్రయాణికులకు మరీని. వాళ్ళలోనూ థరుడుక్లాసు, ఇంటరుక్లాసు ప్రయాణికులకు తాము విశాలంగా కూర్చుందికి తగిన స్థలం దొరికితే, మరికొంతమంది ఎక్కినా దిగినా అంత మరీ బాధగా ఉండదు. (అవి ఇంకా ఇంటరుక్లాసు ఉండేరోజులులెండి.) అయితే వీళ్ళకి లేని బాధ ఇంకొకటి సెకండుక్లాసు వాళ్ళకి ఉంటుంది. అదేమిటంటే, తామెక్కిన బండీ ఏమో తమ స్వంతంలాగ, అందులో న్యాయంగా మరి ఇద్దరు ముగ్గురికి స్థానం ఉన్నా ఇంకొకరెక్కారంటే తమహక్కు సగంపోయినట్టుగా తమ ప్రయాణంలోని సౌఖ్యంయావత్తూ అంతరించిపోయినట్టుగా భావించుకొంటారు.

రాత్రి మద్రాసులో బయలుదేరిన దగ్గరనుండీ కామేశ్వరరావుకి అలాగే వుంది. తానూ లీలాస్వేచ్ఛగా మాట్లాడుకొందికే వీలుచిక్కలేదు ఉదయం విజయవాడలో బండి ఆగేవరకున్నూ! అక్కడ తమతో అంతవరకూ వచ్చిన లాంకోటు, టోపీ ఆయనా, ఖద్దరు చొక్కా ధోవతీ ఆయనా ఇద్దరూ దిగిపోయారు. ఇకనైనా ఏ చీకూ చింతా లేకుండా హాయిగా ప్రయాణం చెయ్యవచ్చుననుకొంటే తీరా బండి కదిలే వేళకు వచ్చి పడ్డాడొక సూటు బూటు ధరించిన యువకుడు, వేషం చూస్తే ఏదో మందుకంపెనీ ఏజంటులాగుంది. అతను తమతోకూడా వచ్చి గోదావరిలో దిగిపోయాడు. అదృష్టవశాత్తు గోదావరిలో తమ పెట్టెలో ఎవ్వరూ ఎక్కలేదు. కాని, ఇకముందు ఎక్కరని నమ్మకం ఏమిటి?

"ఈ స్టేషనులోగాని, ఎవరైనా మన బండిలో ఎక్కితే, వచ్చే స్టేషనులో దిగి, ఫస్టుక్లాసులోకి టిక్కట్లు మార్పించేస్తాను."

లీల అంది — "ఎవళ్ళెక్కితే మనకేమి? మన జాగా వాళ్ళేం తీసుకోలేరు కదా! ఎందుకు ఫస్టుక్లాసు ఇంకా దండుక్కి, నాకిలాగే బాగుంది, అయినా చూడు, అమ్మేవాళ్ళగోల తగ్గిపోయింది. బండి బయలుదేరే వేళయినట్టుంది. మరింకెవరూ ఎక్కరేమోలే. ఎందుకలా ద్వారందగ్గర మొహం పెట్టుకొని నిలబడకొవు? లోపలికివచ్చి కూర్చోకూడదూ! బండిలో ఎక్కదలచుకొన్నవాళ్లు నువ్వు అడ్డం నిలబడ్డా ఎక్కడం మానరు."

సరిగా ఆమె అన్నట్టే జరిగింది.

ఇంజను కూసింది. గార్డు విజిలు వేశాడు జెండా ఊపాడు. ఇంజను ఈమారు నిజంగా అన్నట్టు కూసింది.

అంతసేపూ ప్లాటుఫారంమీద పనీ పాటు లేనివాడిలా అటునించిటూ ఇటునించటూ, తిరుగుతూ ఉండిన సన్యాసిరాజుగారు తమ పెట్టె పక్కనున్న గజం పట్టుకొని వేళ్ళాడుతూ "అబ్బాయి! తలుపు తియ్యి నాయనా మరి నాకీ ప్రయాణం తప్పేట్టు లేదు - ఆ వెధవ రాహువు ఉన్నాడే నన్నిలా తిప్పి చంపుతున్నాడన్నాడు."

ఆయన మాటలు సగం సాగుతూ ఉండగానే కామేశ్వర్రావు, "ఇది సెకండుక్లాసండీ, పరువులబండి."

అతను "తెలుసును బాబూ! అందుకే యాభైరూపాయలు పోసి టిక్కట్టు కొన్నాను." అంటూ తలుపు తెరచుకొని లోపల ప్రవేశించి, ఖాళీగాఉన్న బెర్తు మీద కూలబడి వగర్చుకొంటూ, "వెధవ డబ్బు, పోతేపోయింది, ఈ ప్రయాణం తప్పుతుందేమో అంటే తప్పిందికాదు. ఎలా తప్పుతుందీ, ఆ రాహువుగాడు శనిగాడితో కలిసి నన్నిలా ఆడిస్తూఉంటేను. రోజూ సరిగా వేళకిపోయే ఈ ముండా మెయిలు ఇవాళ పదినిముషాలు లేటుకూడా. ఇవాళ సరిగా వేళకి పోయివుంటే, నాకీ ప్రయాణం తప్పిపోయి ఉండును. ఎలా తప్పుతుంది నాయనా, అంతా గ్రహచారం! ఈ ప్రయాణం ఇవాళ ఇలా జరగాలని రాసివుంది."

కామేశ్వరరావుకి ఈ ధోరణి చికాగ్గా ఉంది.

"అంతగా ప్రయాణం తప్పిపోవాలంటే, రైలెక్కడం మానీలేకపోయారూ? చేసే పనులు చేస్తూఉండడం, గ్రహచారం అనుకొంటూ ఉండడమూను.

"రైలెక్కకపోడమూ? నేనూ ఎక్కకుండా ఉండాలనే అనుకొన్నాను. అందుకోసమే, మద్రాసు, నెల్లూరు రెండు టెలిగ్రాములిచ్చాను, మా కుర్రవాళ్లిద్దరికీని. వాళ్ళలో ఏ ఒక్కడు ఈ బండిలో వచ్చి ఉండినా నేను హాయిగా ఇంటికివెళ్ళి పడుకొని ఉందు నీపాటికి. కావలసినవాళ్ళింట్లో పెళ్ళి. కుటుంబంలో ఎవళ్ళో ఒకళ్లు వెళ్లితీరాలి - ఇద్దరు కుర్రాళ్ళలోనూ ఒకడైనా రాకపోడం గ్రహచారం కాక మరేమిటి?"

"గ్రహచారమే బాబూ! గ్రహచారమే"

"నాయనా! నువ్వు స్పష్టంగా అనకపోయినా నాకు నీ ఉద్దేశం తెలుసును — హాయిగా చిలకా గోరింకల్లా ప్రయాణం చేస్తున్న మీ యిద్దరికీ మధ్యను నావంటివాడొకడు వచ్చి పడడం మీ గ్రహచారమని."

అక్కడితో లీల ఊరుకోలేకపోయింది.

"అదేమీ లేదు బాబుగారూ! ఈ బండేం మా స్వంతంకాదు. మేము తీసుకొనిపోయేది లేదు. మీరూ మాలాగే టిక్కట్టు కొను

క్కని వస్తున్నారు. మీకు లేని హక్కు మాకేముంది?"

ఆమె ఇలా కలుగజేసుకొని పరాయి మనిషితో మాట్లాడ్డం కామేశ్వరరావుకి ఏమీ నచ్చలేదు - అయితే, అంతమాత్రంలో ఆమెను మందలించడానికి కూడా అవకాశం లేదు - అద్దంముందు బల్లమీద ఉంచిన గోల్డుఫ్లేకు సిగరెట్టుడబ్బా తీసుకొని, బెర్తు మీద కిటికీవంక తిరిగి కూర్చొని, సిగరెట్టొకటి తీసి, అగ్గిపుల్ల వెలిగించాడు, ఆరిపోయింది. ఆమాత్రం గాలిలో ఆరిపోకుండా అగ్గిపుల్ల వెలిగించడం అతనికి చేతకాక కాదు; కోపంలో తొందరగా వెలిగించడం మూలాన ఆరిపోయింది. ఈమారు కొంచెం నెమ్మదిగా ముందుకు వంగి జాగ్రత్తగా సిగరెట్టు ముట్టించుకొని, బలంగా ఒక్కమారు పొగపీల్చి, మళ్ళీ కిటికీవంక తిరిగాడు, మీ ఖర్మం, మీ యిష్టంవచ్చినట్టు మాట్లాడుకోండి, నాకేం బాధ" అన్నట్టుగా.

అంతసేపూ చేతిలో పట్టుకొనిఉన్న పెద్ద కాన్వాసు సంచీని బెర్తుమీద తన పక్కగాఉంచి, పైమీది ఉత్తరీయంతో మరోకమారు మొగం తుడుచుకొని, దానిని తీసి, సంచిమీద ఉంచి కొంచెం విశ్రాంతిగా వెనక్కు చేరగిలబడి కూర్చున్నారు సన్యాసిరాజుగారు. తిలతండుల న్యాయంగా ఉన్న సుమారు పదిరోజుల పెరుగుదల కలిగిన గడ్డం, పెద్ద పొట్ట చెమటకు తడిసిన ముతకఖద్దరుచొక్కా, చవకరకం నేతపంచ, అతని వేషంలో థరుడుక్లాసు ప్రయాణీకుడి లక్షణాల్ తప్ప సెకెండు క్లాసు ప్రయాణీకుడి కళ ఎక్కడా గోచరించడంలేదు. పైమీది ఉత్తరీయం కొంచెం ఖరీదయినది కావడంకంటే అతను ధాటిగా "యాభైరూపాయలు పోసి టిక్కట్టు కొన్నాను" అని ఉండకపోతే కామేశ్వరరావు లోనికి రానిచ్చేవాడే కాదు.

సన్యాసిరాజుగారు కొత్త మర్యాదగా ముందుకువంగి "అమ్మాయి! నీకు నేను చుట్టకాల్చుకొంటే అభ్యంతరం ఉండదు కదూ? ఎంచేతంటే అబ్బాయి వరసమీద సిగరెట్టు కొత్తేరకంలాగుంది. ఆ పొగకి అలవాటుపడినవాళ్లకి ఇది అంత బాధ కలిగించదు" అంటూ సంచీలో వెతకనారంభించాడు.

ఆమె, "నాకేంబాధలేదు బాబుగారూ! మీయిష్టంవచ్చినన్ని చుట్టలుకాల్చుకోండి" అంది.

సన్యాసిరాజుగారు, చుట్టలున్న తోలు డొక్కు తీసి, అందులోనుండి, ఖరీదయిన దొరలు కాల్చేరకంచుట్టతీసి డొక్కు మళ్లీ సంచీలోఉంచి, వెనక్కు చేరగిలబడి, అన్నాడు.

"నాకు తెలుసునమ్మా నువ్వేం అభ్యంతరం చెప్పవని, ఇప్పుడు నాకీ ప్రయాణం తప్పకపోవడం ఎంత నిశ్చయమో, అలాగే ఇది అంత సుఖప్రదంగానూ, అనుకూలంగానూ జరిగితీరాలని రాసి పడేసిఉంది. ఉచ్ఛస్థుడైన శుక్రుడిప్రభావం ఊరికే పోతుందా?" అని అగ్గిపుల్ల వెలిగించి చుట్ట ముట్టించాడు.

లీల అంది—"బాబుగారికి జాతకాలూ గ్రహాలూఅంటే చాలా నమ్మకంలాగుంది?"

సన్యాసిరాజుగారు చుట్టపొగ గట్టిగా పీల్చి, కిటికీలోనుండి బైటికివదిలి, పెద్ద ఉపన్యాసానికి సిద్ధపడేట్లుగా గొంతు సర్దుకొని, "మంచి ప్రశ్న వేశావమ్మా - జాతకాలంటే, గ్రహబలం అంటే ఎవరికి నమ్మకం ఉండదు? అందరూ పైపైకి మాకేం నమ్మకంలేదని డబాయించేవారే. అందులోనూ చదువుకొన్నామనీ, నాగరికులమని అనుకొనేవారికి ఇదొక చాదస్తం."

"అయితే జాతకాలను నమ్మకపోడమే చాదస్తం అంటారు?"

"నేననడంలో ఏముంది? ఎంతటినమ్మకంలేదనే వాళ్ళకయినా దొరలాగా, గుండెకి పట్టే పోయేట్టుగా ఒకటిరెండు ఫలితాలు ఋజువిచ్చేయంటే ఆ తరవాత వాళ్ళకే మాకంటే ఎక్కువనమ్మకం ఏర్పడిపోతుంది. మా తమ్ముడి క్లాసుమేటు ఒక ప్రాక్టీసు లేని ప్లీడరుండేవాడు. ప్రాక్టీసు లేకపోయినా భుక్తికి లోటులేని పాటి ఉపాధి ఉండేది. అయినా అతనికి స్వంత ఆర్జనంటూ లేకపోడం ఎంతో కించగా ఉండేది. స్కూలు మాష్టరి ట్రెయినింగుకి వెళ్ళడమూ లేక ఏదయినా గుమాస్తాగిరీలో ప్రవేశించడమూ అనే స్థితికి వచ్చాడు. వాళ్లింట్లోవాళ్ళు కూడా అదే బాగుందన్నారు. నేను ఒక్కణ్ణే అడ్డుతగిలాను. "నాయనా! నువ్వేం విచారించకు. నీకు ముప్ఫైఅయిదవ ఏడు వచ్చేసరికల్లా మంచి అధికారం హోదాగల గవర్నమెంటు ఉద్యోగంలో ప్రవేశించి తీరుతావు" అన్నాను. అన్నట్టుగానే గవర్నమెంటు వారి సెలక్షనులో నెగ్గి, సబ్‌కలెక్టరయి ఉన్నాడు. నేడో రేపో డిస్ట్రిక్టు కలక్టరు కూడా అవుతాడు. అయితే ఈ మాటలు చెప్పినప్పుడే నోటితో చెప్పడానికి మొగమాటించి కాగితంమీద రాసి కవరులో పెట్టి సీలు చేసి ఉంచాను. గవర్నమెంటు ఉద్యోగం వచ్చిన మూడునెలల్లో భార్య పోయింది. ఆరుగురు చిన్నపిల్లలు—మళ్ళీ పెళ్లిచేసుకోలేడు, మానలేడు, తగిన సంరక్షణచేసే దిక్కులేక పిల్లలూ తనూ నానా అవస్థలూ పడుతున్నారు. ఇటీవల నేను సీలుచేసి ఉంచినకవరు విప్పి చూశాను. ఏముంది, "కళత్ర వియోగం, సంసార సౌఖ్యలోపం" అని ఉంది. అతనికిప్పుడు నిజమైన మనశ్శాంతి నిచ్చే అంశం ఏదైనా ఉంది అంటే అది జాతకాలనూ చేతులనూ పరిశీలించడమే. హస్తసాముద్రికంలో ఇప్పుడిప్పుడు అతనూ చాలా మంచి ఫలితాలనే చెప్పగలుగుతున్నాడని వింటున్నాను."

లీల కుతూహలం కొంచెం ఎక్కువయింది.

"అయితే బాబుగారు! తమరు కూడా చేతులు చూస్తారేమిటి? లేక వట్టి జాతకాలేనా?"

కామేశ్వరరావు సాగ్రహంగా ఒకమారు లీల వంకచూసి, మళ్ళీ కిటికీ వంకకి తిరిగి అయిపోతున్న సిగరెట్టుకి ఇంకొకటి అంటించాడు. అతడు చూసిన చూపును లీల కంటె సన్యాసిరాజే బాగా గుర్తించాడు కాని, అతని రండు కళ్లద్దాల మొగంలో అటువంటి స్ఫురణఏమీ గోచరించలేదు.

కిటికీ వంక తిరిగి చుట్టగొయ్య దులిపి, లీల నుద్దేశించి అన్నాడు. "భగవంతుడి దయవల్ల ఏదో పెద్ద లార్జించి పడేసిన ఆస్తికాస్త ఉంది. అయితే నిర్వ్యాపారంగా కూర్చొని తినడం కాపురుషలక్షణం కదా అని, ఈ జాతకాలూ సాముద్రికం, ఆయుర్వేదం ఇవన్నీ కృషిచేశాను. పెద్ద ఉద్యోగాలు చేసే వాళ్ళకయినా తీరిక ఉంటుంది గాని, నాకు రోజుకి కొద్ది గంటలయినా తీరిక ఉండదంటే నమ్మ-అయితే మొదట్లో జనం మరీ ఎక్కువ కావడంతో ఒక నియమం పెట్టేను. జాతకంగాని, చెయ్యిగాని చూపించుకోదలచుకొన్న వాళ్లు తలా ఒక రూపాయి చెల్లించాలి. ఆ డబ్బయినా నేను పేదవాళ్ళ కిచ్చే మందులకయ్యే ఖర్చులకి ఉపయోగిస్తాను. దీనివల్ల కాలక్షేపానికి కాలక్షేపం, చేతిచమురు భాగవతం కాకపోడమున్నూ సిద్ధిస్తోంది."

లీల కుతూహలాన్ని అణుచుకోలేకపోయింది.

"అయితే, బాబుగారూ! మీ మామూలు రూపాయి ఇచ్చుకొంటాం, మా చేతులు చూసి చెపతారా?"

మామూలంటే ఇంటిదగ్గర తీర్థప్రజలాగ వచ్చిపడే జనాన్ని అరికట్టడానికిగాని మీ వంటి వాళ్ళ మాటకాదు. ఇప్పుడు నేను ఇక్కడ మీ దగ్గర పుచ్చుకొన్నా అదికాస్తా డబ్బులో కలిసి ఖర్చయి పోకుండా ఉండాలి. నేను మా గురువు గారికి మాట ఇచ్చేను. ఈ విద్యమూలంగా డబ్బు ఆర్జించనని-సరే చేతులు చూడ్డానికేం తొందర? మీరూ చాలా దూరం ప్రయాణం చెయ్యవలసినట్టుంది."

"అవును బాబుగారూ! ఇది రేపు ఉదయం

# ★ హస్తసాముద్రికం ★

మధురా ఈ పేరికిగాని కలకత్తా చేరడను కొంటాను."

"సరిగా అంతే. అందులోనూ, దారిలో ఏ అవాంతరాలూ లేకుండా ప్రయాణం జరిగితేనే. అయితే యివాళ మన ప్రయాణం చాలా సుఖకరంగా జరిగితీరాలి. నా గోచార ఫలితం రీత్యా! ఇటీవల రైలు ప్రమాదాలు మరీ యెక్కువయి పోతున్నాయి; రైళ్లెక్కడమంటేనే భయంగావుంది, యెక్కడ యేమి ప్రమాదం వచ్చిపడుతుందోనని. అందుకే ప్రయాణానికి తయారయేముందు, గ్రహస్థితి అదీ సరిగా చూసుకోందీ బయలుదేరను."

"మీ గ్రహస్థితి బాగుంటేమాత్రం రైల్లో ఇందరు ప్రయాణం చేస్తారుగదా, వాళ్లందరి గ్రహచారం బాగుండక యేదైనా రైలు ప్రమాదం తటస్థిస్తే?"

"చాలా చక్కటి ప్రశ్న వేశావమ్మా! కాని మొత్తంమీద రైలు సరిగా నడిచేదీ లేనిదీ లెక్కకట్టడానికికూడా సాధనాలు లేకపోలేదు. నాది పూచీ, రైలివాళ అట్టే లేటుకూడా కాకుండా ఇప్పటిలాగే చక్కగా ప్రయాణం చేసితీరుతుందని. అయినా యీ యెండ మరీ తీవ్రంగావుంది. ఇక్కడ ఇంత విశాలంగా కూర్చున్నాం; పంకాలు రివ్వున తిరుగుతున్నాయి - అయినా మనకి యింత బాధగా వుంటూంటే, పదిమంది కూర్చోవలసిన పెట్టెలో యాభైమంది యిరుక్కున్న థర్డుక్లాసు ప్రయాణీకుల సంగతి యెలా వుంటుందో?"

లీలకు థర్డుక్లాసుకీ సెకండ్ క్లాసుకీ వుండే సదుపాయాల తారతమ్యాన్ని చర్చించడానికి కుతూహలం లేకపోయింది. సాధ్యమైనంతత్వరలో తనచేతిని చూపించుకొని భవిష్యత్తును లీలగానయినా తెలుసుకోవాలనే తహతహ ఎక్కువయిపోయింది.

"బాబుగారు ఎంతవరకు ప్రయాణంచేస్తున్నారో చెప్పారుకాదు."

"నేనా? నేను." అంటూ ఉండగా దగ్గు వచ్చింది...చేతిలోని చుట్టపారేసి కొంత సేపు దగ్గి, కిటికీలోనుండి వంగి ఉమ్మి, మొగం తుడుచుకొని, "నేను బరంపురం దాకావస్తాను. అంటే, ఇంకా ఎక్కడ ఏ రాత్రి పదిగంటలో అవుతుంది. అంచేత మనం తీరికగా చేతులు చూసుకోవచ్చును. ఈలోగా ఒక్కక్షణం, అంటే ఒక్క అరగంట కాస్త కన్ను మూస్తాను. ఎక్కడ, సుమారు పదిహేనేళ్లుగా అవిచ్ఛిన్నంగా సాగిపోతున్న అలవాటు, మధ్యాహ్నం భోజనానంతరం ఒక్క అరగంట కన్ను మూయడం. తరవాత మరి రాత్రి పడుకొండువరకూ బాధలేదు." అని ఆమె సమాధానంకోసం ఎదురుచూడకుండా, చేతి సంచీని ఒక మూలగాలోని తలక్రింద పెట్టుకొని, పడుకొన్నాడు.

ఒక్కక్షణం పడుకొని, ఏమి అనుమానం వచ్చిందో, అలాపడుకొనే, చొక్కా గుండీలు తీసి, లోపలిజేబులోనున్న పర్సు తీసి అందులోని నోట్లను జాగ్రత్తగా లెక్కపెట్టుకొని, పర్సులోవుంచి పర్సుభద్రంగా జేబులో పెట్టుకొని దానికొక పిన్ను పెట్టి, చొక్కా గుండీలు పెట్టుకొని కిటికీవంక తిరిగి నిద్రపోయే ప్రయత్నం సాగించాడు.

అయితే పట్టి ప్రయత్నించడం మాత్రమే అయింది. ప్రతికొద్దినిమిషాలకీ అటూ ఇటూ తిరుగుతున్నాడు. ఎంత గాఢమయిన అలవాటయినా పరిసరాలు మారేసరికి యథాప్రకారంగా సాగకుండా ఉంది.

ఒకమారు లీలతో అన్నాడుకూడా. "చూడమ్మా ఇందాకా కూర్చుంటే అంత నిద్ర ముంచుకొని వచ్చినట్టయిందా, తీరా పడుకొందామనేసరికల్లా నిద్ర రావడం లేదు. ఏమయినా సరే, సామర్లకోట వచ్చే పర్యంతం నా ప్రయత్నం నేను చెయ్యడం మానను. గీతలో శ్రీకృష్ణభగవాను చెప్పాడు, "నీ ప్రయత్నం నువ్వు చెయ్యి, ఫలితం ఏమయినా సరే" అని కదా.

లీల తాను చదువుతూన్న పుస్తకం వంకనుండి ఒక్కమారు మొగం తిప్పి, మందహాసంతో సన్యాసిరాజుగారివంక చూసి, మళ్ళీ పుస్తకపఠనంలో నిమగ్నురాలయింది.

ఈమారు అట్టే ప్రయత్నం లేకుండానే నిద్రపట్టిపోయింది సన్యాసిరాజుగారికి. కొద్ది సేపటిలోనే గురకపెట్టి నిద్రపోసాగారు.

లీలకి తను చదువుతున్న నవల ఏమీ బాగుండకపోయినా అంతకంటె చురేం చేసేదిలేక అలా చదువుతూంది.

విపరీతంగా కాల్చడంవల్ల సిగరెట్లు రుచి లేకపోడం అటుండగా పెదవులు మండుతూన్నా, కామేశ్వరరావు చేసేపని మరేదీ లేక వరసగా సిగరెట్లు కాలుస్తున్నాడు.

సిగరెట్లు కాల్చడమన్నది ఆలోచన లేకుండా సాగిపోయే పని; ఆలోచన వేరే మార్గాన సాగిపోతూంది.

అలానే లీలకూడా పుస్తకంలోని అక్షరాలను చూస్తున్నది; పేజీలు తిరిగిపోతున్నాయి, కాని ఆమె మనసుకూడా ఏవో ఆలోచనలను నెమరువేస్తున్నది.

ఇక, బండిలోని మూడవ ప్రయాణికుడు సన్యాసిరాజుగారు; ఆయన బండిలోని పంకాల హోరును మించి గుర్రుపెడుతున్నారు, ఆయన మనసు ఏం చేస్తున్నదో గుర్తించడం కష్టం.

కామేశ్వరరావుకి కాల్చగా కాల్చగా సిగరెట్లమీద కోపం వచ్చిందో, లేక తన ఆలోచన ఒక నిశ్చయానికి వచ్చిందోగాని, కాలుస్తున్న సిగరెట్టు సగం పైగా ఉండగానే కిటికీలోనుండి పారేసి, బండిలోని ఆ పరిమితస్థలంలోనే అటూ ఇటూ పచారు చేయసాగాడు.

లీలకి తాను చదువుతున్న పుస్తకంమీద విసుగుపుట్టింది కాబోలు, పుస్తకం మూసిచి బల్లమీద పడేసి, తలగడసర్దుకుని చేరగిలబడింది, నిద్రపోయే ప్రయత్నంలో—

సన్యాసిరాజుగారి గుర్రు ఒక్కమారు ఆగడంతో బ్రహ్మాండమైన రొదచేసే ఫేక్టరీ ఏదో ఆగిపోయినట్టయింది. ఆయన ఇంకా బాగా నిద్రపట్టాలని కాబోలు పల్చని ఉత్తరీయాన్ని మొగంమీద వేసుకొని మరీ పడుకొన్నారు. మళ్లీ కొంచెంసేపటిలోనే యథాపూర్వంగా గుర్రు వినిపించసాగింది.

లీల కన్ను మూసుకొంటూంది, తెరుస్తూంది; ఆమెకు నిద్రపట్టేసావకాశం మళ్ళీ పుస్తకం పట్టుకుంటేనేగాని లభించదేమో ననిపించి పుస్తకంతీసి, తప్పున తెరిచి ఎక్కడవస్తే అక్కడనుండే చదవడం మొదలుపెట్టింది. అనుకొన్నప్రకారం చదవడం మొదలుపెట్టడంతో కళ్లు బరువెక్కసాగాయి.

పాపం, కామేశ్వరరావు, ఎంతకని పచారుచేస్తాడు! తిరిగితిరిగి, ద్వారందగ్గరకు వెళ్లి బైటికిచూస్తూ ఉండేవాడు, నిలబడి ఆలోచిస్తూ ఉండేవాడు; అప్పుడప్పుడు సన్యాసిరాజుగారివంక తేరిపారి చూస్తూ ఉండేవాడు. చిట్టచివరికి ఏదో నిశ్చయానికి వచ్చినట్టుగా లీలదగ్గరికివెళ్ళి కళ్ళతోనే ఏమో మాట్లాడాడు.

అతని ఈధ్వనిలేని కంటిభాషతో లీల నిద్దరమత్తంతా ఎగిరిపోయింది - ఆమె తన కింతమాత్రం ఇష్టంలేదని వారించింది చూపులతోనే - అతను, ఇంతమాత్రానికి నీకెందుకుభయం అన్నట్టు ప్రశ్నించాడు - ఆమె ససేమిరా వల్లకాదంది. లేచి కూర్చొని, మళ్లీ పుస్తకం చదవడం మొదలుపెట్టింది. కామేశ్వరరావుకి ఆమె అయిష్టత ఒక పెద్ద అడ్డంకి కాకపోయినా తనికి తగిన ధైర్యంచాలక, మళ్లీ ఎప్పటిచోట బెర్తుమీద కూలబడ్డాడు. ఇందాకటికంటే జోరుగా సిగరెట్టుతీసి ముట్టించాడు.

లీల ఏమో సమాధానం చెప్పబోయినట్లుగా అతని వంకచూసింది. అతనికి ఆమెను అర్థంచేసుకోవలసిన అవసరం కనిపించలేదు. పక్కకు తిరిగి తన సిగరెట్టు పొగలో తన్మయుడయాడు—

సామర్లకోటస్టేషను వస్తుండగా సన్యాసి

రాజుగారు లేచి, లీలను కుశలప్రశ్న చేశారు. "అప్పటినుండి అలా కూర్చున్నారన్నమాట? కుర్రవాళ్లు గనక మీకా శక్తి ఉంది. గాని మాలాటి పెద్దవాళ్లకు మధ్యాహ్నం ఒక్క క్షణం కునుకుతీస్తే గాని, ఏమీ తోచదు. ఇందాకా నీతో ఏమిటో మాట్లాడుతున్నాను గాని, ఏమి మాట్లాడుతున్నానో నాకే తెలియదు. ఇక నుంచీ, మరి ఎంతరాత్రివరకయినా బాధలేదు" అని సంచిలోని తువ్వాలు తీసుకొని బాత్‌రూములోనికి వెళ్ళేరు. మొగం కడుక్కొని వచ్చి తువ్వాలును ఆరబెట్టి, సరిగా కూర్చొని, ఉత్తరీయం మడతలు పెట్టి మెళ్లో వేసుకొనే సరికల్లా స్టేషనులో రైలాగింది.

"అమ్మాయి! ఇక్కడ స్టేషనులో మావాడొకడున్నాడు. వాడితో ఒక కబురు చెప్పవలసి ఉంది. కాకినాడలో ఒక పెద్ద ప్లీడరుగారికి ఒక సందేహం వచ్చింది. నన్ను వారి కుమార్తె జాతకం చూడమన్నారు - ఆ కబురు ఇక్కడ చెప్పేస్తే అందిపోతుంది. అంటే తిరుగుదలలో నే నెలాగూ కాకినాడ వెళ్ళవలసింది. మీకేమయినా కాఫీ టిఫిను మొదలయినవి కావలసి ఉంటే..."

"మాకేమీ అక్కర్లేదు బాబూ! అయినా పెద్దవారు మిమ్మల్ని శ్రమ పెట్టడమా?"

"ఇంతమాత్రంలో శ్రమేం ఉందమ్మాయి! నేనలా అనుకోవలసినవాణ్ణి కాను. సరే, నా సంచీ చూస్తూ ఉండమని చెప్పనక్కర్లేదు - ఇందులోకి బహుశః ఎవరూ ఎక్కరు. ఎక్కినా తగు మనుషులే గాని మరొకరు కాదు - నేను కాఫీ ఫలహారమూ తెస్తానమ్మాయి, మీ యిద్దరికీ" అంటూ సంచిలోని థెర్మాసుఫ్లాస్కును పట్టుకొని దిగి వెళ్ళిపోయారు తిన్నగా స్టేషనుమాష్టరు ఆఫీసు వంకకు—

ఆయన అక్కడ పని తెముల్చుకొని, ఫలహారాల దుకాణంలో తాను ఫలహారం చేసి, బండిలోనివారికి ఫలహారాలు పొట్లాలు కట్టించి, కాఫీ ఫ్లాస్కులో పోయించుకొని వచ్చేసరికల్లా సరిగా బండి కదిలే వేళయింది.

బండిలో కామేశ్వరరావు లేడు.

లీల ఎప్పటిలా పుస్తకం పట్టుకొని కూర్చుంది.

సన్యాసిరాజుగారు లోపలికి వస్తూ "అబ్బాయి ఏడీ" అని ప్రశ్నించాడు.

లీల పరధ్యానంగా "వాళ్ళ స్నేహితుడు సుందర్రావు దగ్గర కెళ్ళేరు" అంది—

"సుందర్రావా? ఎవరు? అతనూ ఈ బండిలో వస్తున్నాడా? అలా అయితే ఫలహారం మరి కొంచెం పొట్లం కట్టించి ఉండేవాణ్ణే, కాఫీ బాధ లేదు సరిపోతుంది."

"వద్దన్నా మీరు తేవడం మాకేరకారు- అయినా ఎందుకిన్ని పొట్లాలు."

"ఎన్నున్నాయమ్మా; అసలు నే నివి చాలవేమో ననుకుంటూ ఉంటే .... అరె, రైలు కూసింది, వీళ్ళింకా రాలేదేం చెప్మా? కదిలిపోతూంది."

"పోతే పోనీండి, వాళ్ళు మరే బండిలో ఎక్కిపోతారు, వచ్చే స్టేషనులో ఇక్కడికి వస్తారు.

"వచ్చే స్టేషనులో నాకీ అంతవరకు

# ★ హస్తసాముద్రికం ★

కాఫీకి బాధలేదుగాని, ఫలహారాలు చల్లారిపోతాయి. నేనసలు కొంచెం ముందువచ్చి ఉంచేశాను."

"వాళ్ళేం తినరనా? మీ కెందుకంత విచారం బాబూ; మీరు మీ కబురేదో చెప్పేశారా?"

"అది చెప్పకేం చెప్పాను—కాని, కనిపించకపోతే బాధలేదుగాని, కనిపిస్తే ప్రతివాళ్లు ఏవేవో ప్రశ్నలడిగేవాళ్ళే - ఏమున్నా, ఎవరి ఆతృత వారిది. అందరినీ తప్పించుకొని, దుకాణానికి వెళ్లేసరికి ఆలస్యం అయింది.

"బాబుగారు! నా చెయ్యి చూస్తున్నారు?"

"అన్నాను, ఇప్పుడు మాత్రం కాదంటున్నానా? ఈ సన్యాసిరాజు ఒక్కమాట అన్నాడంటే ఎన్నటికీ మరిచిపోడమ్మాయి! అయితే ఒక్క షరతు; నువ్వు చెప్పినట్టు వాళ్ళిద్దరూ ఫలహారం చేసివుంటారు. పాపం నువ్వు అలా కూర్చుంటే లాభం లేదు. కాస్త టిఫిన్ తిని, కాఫీ తాగివస్తే అప్పుడు తీరికగా కూర్చుందాము. మళ్ళీ వాళ్లొచ్చేదాకా నేను కదలను - నీకు ఫలితాలు అన్నీ కరతలామలకం అయ్యేట్టు చేస్తాను - మరి నీదే ఆలస్యం ఈలోగా నేను మరొక్క చుట్ట కాల్చుకుంటాను.

"మీరు మరేమీ తినరూ? నాకు ఒక్కర్తెకూ తినడం అదోకలాగుంటుంది బాబూ!

"నేనిప్పుడు మరేమీ తినలేను- అయినా మా వయసులో ఒకరు తింటే చూసి ఆనందించడమే తప్ప, స్వయంగా అట్టే తింటే పడదు. నువ్వంతగా కాదంటే కాఫీ అక్కడ తాగినా మళ్ళీ తాగుతాను. నీదగ్గర ఏదయినా గ్లాసుందా?"

"ఉందిబాబూ", అంటూ తను సామానులోనుండి, ఒక పెద్దగ్లాసుతీసి, దానినిండా ఫ్లాస్కులోని కాఫీపోసి ఇచ్చింది."

అతను కాఫీతాగడం పూర్తి అయేలోగా ఆమె ఎలాగూ తప్పదని, ఒక లడ్డూ, రెండు గారెలుతింది. అతను ఖాళీచేసిన గ్లాసును కడుక్కొని అందులో కొంచెం కాఫీపోసుకుని తొందరతొందరగా తాగింది. అతను అంత కొంచెం కాఫీ తాగడమేమిటమ్మాయి, అని బలవంతంగా మరికొంత కాఫీ గ్లాసులో పోసి, ఆమె చేత తాగించాడు.

తువ్వాలుతో చెయ్యి తుడుచుకొని, డబ్బాలోని వక్కపొడి కొంచెంతీసి నోట్లో వేసుకొని సన్యాసిరాజుగారికి ఇవ్వడమా మానడమా అని సందేహంలో పడింది అంతలో ఆయనే అడిగి తీసుకున్నాడు. ఆయన వార్ధక్యంకబుర్లలో నేతిప్ప పళ్లలో లేనట్టుంది. పటపటమని నములసాగాడు. వక్కపొడిని.

ఆయన తనంతట తాను పిలిచేవరకు ఎదురుచూసే ఓపిక పట్టలేక, లీల తానే వెళ్లి ఆయన దగ్గరగా కూర్చుంది చేయి ముందుకు చాపి. సన్యాసి రాజుగారు చొక్కాపక్క జేబులోంచి ఒక భూతద్దాన్ని తీసి ఉత్తరీయంతో తుడిచి చేతిని పరిశీలించసాగారు.

కొంతసేపు భూతద్దంతో చేతిలోని రేఖలనూ వాటినీ, పరిశీలించేవాడు; తరువాత కొంతసేపు వేళ్ల పొట్టి పొడుగులను, అరచేతినున్నదనాన్నీ ఎత్తుపల్లాలనీ శ్రద్ధగా గమనించేవాడు; చేతిని గోళ్ళనూ ఊరికే నే కొంతసేపు చూడడం, భూతద్దంతో కొంతసేపు చూడడం.

లీల అతని ముఖంలోని కదలికలను అతిశ్రద్ధగా గమనించేది. అతను సంతోషిస్తున్నాడో, విచారిస్తున్నాడో తన భవిష్యత్తునుగూర్చి ఏమి భావిస్తున్నాడో, భూతంలా తన్ను పట్టుకొని వదలకుండా ఉన్న భూతంగురించి అంతా అతనికి తెలిసిపోయిందేమో? ఏమీ చెప్పకుండా ఉన్నాడు.

లీల మరి కుతూహలాన్ని అణచుకోలేకపోయింది. "ఏమిటి బాబుగారూ! ఏమీ చెప్పకుండా ఉన్నారు? అంత చెప్పడానికి వీల్లేనంతపాడుగా ఉన్నాయా రేఖలు?"

"చెప్పక ఎక్కడికి పోతాను? కాని, అసలు ఒకరు చెప్పవలసిన అవసరంలేదు; నీభవిష్యత్తు సంపూర్ణంగా నీ చేతిలో, అంటే నువ్వెలా నడిపించదలచుకుంటే అలా నడుస్తుంది. చేతిలో రేఖలు అనేకం వుంటాయి; అవి ఇచ్చేఫలితాలుకూడా వేరు వేరుగానే ఉంటాయి. కాని, వాటన్నిటినీ తోసిరాజనే బ్రహ్మాస్త్రంవంటి రేఖవొకటి ఉంది; అది ఆత్మశక్తిని సూచిస్తోంది. అంటే నువ్వు పట్టుదలగా చేసితీరాలనుకొన్న పనిని చేసితీరుతావు - ఏది కావాలనుకొంటే అది అయిపోయితీరుతావు."

"నాలో అంతశక్తి వుందంటారా? నేనన్నమ్మను. చిన్నతనంనుండి నేను ఎన్నో కావాలనుకొన్నాను. ఏమేమో చేయాలనుకొన్నాను. ఏదీ చెయ్యలేకపోయాను; అంటే నే ననుకొన్న ప్రకారంగా!

"కావచ్చునమ్మా! కాని; నామాట పూర్తిగా వినుమరి. నేను చూస్తున్న యీ రేఖ యిదివరలో నీచేతిలో లేకపోయి వుండవచ్చును. మన శరీరాలలాగే, మనస్సులలాగే రేఖలుకూడా మారుతూవుంటాయి. అదివరకున్న కొన్ని రేఖలు మాసిపోతూ వుంటాయి; కొత్తవి పుడుతూ వుంటాయి. అంచేత వొక కాలంలో వొక వయస్సులో చేయలేని పనిని యింకొక సమయంలో సులభంగా చేయడం సాధ్యం కావచ్చును.

"ఏమో నేను చిన్నప్పటినుండి యిప్పటివరకూ వొక్కలాగే ఉన్నట్టున్నాను. నాలో యే మార్పులూ వచ్చినట్టులేదు."

"నువ్వలా అంత సులభంగా కొట్టిపారేస్తే కాదు, నన్ను సాంతం చెప్పనీ - ఈ రేఖను నేను చాలా కొద్దిచేతుల్లో చూసేను - అది విపరీతమయిన పట్టుదలనీ, యెటువంటి అవాంతరాలు వచ్చినా యెదుర్కొని తమ పని సాధించుకోగలఆత్మశక్తినీ సూచిస్తోంది. ఈరేఖ, అంటే యిక్కడ కనిపిస్తున్న పెద్ద గీతకాదు, ఆ ప్రక్కకు లీలగా కనిపిస్తోంది. భూతద్దంతో బాగానే కనిపిస్తుందిలే, యిది నీచేతిలో ఈ మధ్యనే ఏర్పడివుండవచ్చును.

"మరి నన్ను చెప్పనీ! నీకు చిన్నతనం నుండీ వొకకోరిక ఉండేది. ఇంతకాలమూ అది తీరనికోరిక అయిపోతుందేమోనని భయపడుతూ వచ్చేవు అయితే నీకువచ్చిన అవకాశాలు బహుస్వల్పం; నువ్వు వాటినైనా సరిగా వినియోగించుకోలేదంటే మరి కోపం తెచ్చుకొని లాభంలేదు - కాని."

సన్యాసిరాజుగారు ఈ "కాని" అనే మాటను చాలా గంభీరంగా మేఘగర్జనలాగ అని కొంచెంసేపు ఆగారు.

లీలకు అత నిలా ఆగిపోవడం యిష్టంలేకపోయింది. "చెప్పండిబాబూ: నేనే మీ అనుకోను; అయితే ఆకోరిక అలా అంతరించి పోవలసిందేనా?"

సన్యాసిరాజు "అది సరిగా ఏ మాటలో చెప్పడమో ఆలోచిస్తున్నాను. గత ఆరు నెలల క్రితంవరకూ నీలోని అనుమానం భయం, చొరవలేనితనం నిన్ను వెనక్కి నెట్టేసేయి. ఇప్పుడు మరి నిన్ను నిలువరించి, మళ్ళీ వెనకటిదారిలో పెట్టడం బ్రహ్మతరంకాదు."

"ఏమిటో బాబూ! నాకు సరిగా అర్థం కావటంలేదు. కొంచం స్పష్టంగా చెప్పండి."

"స్పష్టంగా అంటే అమ్మాయి! చూడూ, ఈ రేఖలు కొన్నికొన్ని ప్రధానమైనసంఘటనలను సూచనగా మాత్రమే తెలియచేయగలవు. వాటిని మనం, మన పరిస్థితులనుబట్టి పరిసరాలనుబట్టి, సావకాశాలనుబట్టి, సమన్వయించుకోవాలి. ఇప్పుడు నువ్వనావనంటే, చూడూ, నిన్నుగురించి నాకేమీ తెలియదు. తెలిసినవాళ్ళ సంగతైతే వాళ్ళ గత జీవితాలనుబట్టి, ఆశలనుబట్టి, ఆశయాలనుబట్టి, భవిష్యత్తునుగూర్చి, వాళ్ళకు కావలసిన పద్ధతిని స్పష్టంగా చెప్పవచ్చు.

అయినా, నీ గురించి, నేను కొంత చెప్తాను. దాన్ని నువ్వు నీ పరిస్థితులకు అన్వయించుకొని అర్థంచేసుకోవాలి. ఇదివరకల్లా నీవు ఎదురుచూస్తూవచ్చిన అవకాశానికి, ఈ ప్రయాణానికి, ఏదో సన్నిహితసంబంధం ఉంది. గత నెలలోకాక రెండుమూడు నెలలైనా కావచ్చును, నీ జీవితంలో ఒక ప్రధానమైన సంఘటన జరిగింది."

"అంతవరకూ రైటే బాబూ! కాని నా కోరిక..."

"అదీ నన్ను చెప్పనీ; నీ వేళ్లను చేతిలోని రేఖలను చూసీచూడ్డంతో ఎంత సాముద్రికం, చేతకానివాడయినా నీలో కళాభిరుచి ఉందన్న సంగతిని సులభంగా చెప్పేయగలడు. అయితే కళల్లోనూ కవిత్వము, చిత్రలేఖనముకంటే నృత్యగానాలకే సంబంధించిన అభిరుచి ఎక్కువ అనవచ్చు."

"అట్టి అభిరుచే నాబాబూ! అది ఏమైనా ఫలిస్తుందా లేదా?"

"నేను ఇప్పుడు చేతిలోఉన్న పరిస్థితిని కూర్చి చెప్పగలనుగాని భవిష్యత్తు అంతటినీ నిశ్చయంగా ఎలా చెప్పడం? ఇప్పటి ధోరణి కనిబట్టిచూస్తే అంతా బాగానేఉంది అందులోనూ నీ ఆత్మశక్తి, పట్టుదల, ఇవి నిన్ను కాపాడాలి. ఇందాకా, నన్ను పూర్తిగా చెప్పనిచ్చేవు కావు. నృత్య సంగీతాలకంటె కూడా, నటనఅంటే నీకు మహాఇష్టం, అదే నీ తపస్సు. అందుకోసం, ఎంతటి త్యాగాన్ని చేయడానికైనా సిద్ధంగా ఉన్నావు."

"అంతవరకు అంతా సరిపోయింది బాబూ. కానీ ....."

"నాకు తెలుసునమ్మా నిన్ను కొన్ని దుష్టగ్రహాలు పట్టుకొని పీడిస్తున్నాయి, అవి నీ ఆశయసిద్ధికి అడ్డు తగుల్తాయేమోనని, వాటిని వదిలించుకోడం, ఎలాగా అని భయపడుతున్నావు కాని అటువంటిభయం, ఏమీ అక్కర్లేదు. వాటిబాధ త్వరలోనే వదిలిపోతుంది"

"నిజంగానా? బాబూ! నిజమే?"

"నిజమేనమ్మాయి! కాని నీ చేతిని ఉంగరంలో ఈ నీలపురాయి ఉండడం, గ్రహాలదృష్ట్యా ఏమీ మంచిదికాదు. నీకు తగింది, మంచి ఆకుపచ్చరాయి. అంటే కేవలం అందంగురించి చెప్తున్నాననుకోకు. ఏదో చవకరకం, గాజురాయి కాక, అసలు పచ్చతాపినఉంగరం, నీ వేలిని ఉంటే, అప్పుడు, కళాభివృద్ధికి కారణమైన, శుక్రుడిప్రభావం, వలన ఇంతవరకు నువ్వు అందనిపండు అనుకుంటున్న అవకాశం దానంతటదే నీ చేతికి వస్తుంది. ఇటువంటిమాటలు నమ్మకం లేనివాళ్ళకు చెప్తే వట్టి చాదస్తం అనుకుంటారు. వేలినున్న రాయికి, అదృష్టానికి ఏమిటిసంబంధం? అనుకుంటారు. నీకు నమ్మకం, ఉన్నా లేకపోయినా నామాట పోదా చూడ్డానికయినా అసలైనపచ్చ ఉన్న ఉంగరాన్ని కొన్నాళ్లు పెట్టుకొనిచూడు. అప్పుడు నీకే బోధపడుతుంది అదేమంత పెద్దఖరీదు కాదు కూడా. అయితే కళారంగంలో అభివృద్ధిని కోరేనువ్వు, పూర్తిగా పచ్చలుతాపిన హారమే ధరించగలిగితే అదృష్టం నిన్ను మూడురోజులలో పైకెత్తేస్తుంది. కానీ పూర్తిగా పచ్చలుతాపిన హారం, అంటే సామాన్యం కాదు. ఏవో మాయరాళ్లు పెట్టిన హారం, కంటె అసలైన నిసలైన ఒకేఒక రాయి ఉన్న ఉంగరాన్ని పెటుకోడమే నయం నీకు నా ఎడ్రెస్సు రాసి ఇస్తాను ఆరు నెలల్లో నీకు తగిన ఫలితం, కనిపించిందో లేదో రాద్దువుగాని"

అతను చెప్పడం ఆపి, ఉత్తరీయంతో మొగం తుడుచుకోసాగేడు.

అతని ఈ ప్రసంగం వింటూఉంటే లీలకు మొదట కొంచెం, గాభరా కలిగింది. కాని చివరంటా వినేసరికి ధైర్యము సంతోషం మాత్రమే కలిగేయి. కొంచెం సేపు తనలో తను గుంజాటనపడి, ఏదో నిశ్చయం చేసుకొన్నట్లుగా లేచి, బాత్ రూములోనికి వెళ్లి ఒక్క నిముషంలో బయటకు వచ్చింది ఆమె చేతిలో ధగధగ మెరుస్తున్న పచ్చలహారం ఉంది. సన్యాసిరాజుగారు, దాన్ని గమనించినట్టేలేదు. చుట్టలు చుట్టలుగా పైకిలేస్తున్న తన చుట్టపొగనే, తదేకదీక్షగా చూస్తున్నారు, ఆమె అడిగింది:

"బాబూ! ఇది చూడండి. ఈ రాళ్లు మంచివే ననుకుంటాను. ఇది మా అమ్మమ్మ తల్లి కాలంనుండీ ఒకరి తరువాత ఒకరికి చెందుతూ వచ్చింది. రాళ్ళు బాగానే ఉన్నా, హారం, పటాటోపంగా ఉండటం వల్ల, నాకు వేసుకుందికి అంత మనస్కరించటం లేదు. కాని మీరు చూసి ఈ రాళ్ళు మంచివంటే వీటితో ఇంకొక హారం, చేయించుకుంటాను."

సన్యాసిరాజుగారు, హారాన్ని చేతిలోనికి తీసుకొని, భూతద్దంతో పరీక్షగా చూస్తూ అన్నాడు:

"ఇందాకా నీ ఉంగరానికి పనికి వస్తుందని చెప్పేను, అందుకు ఇందులోని ఒక్కొక్క రాయే చాలును. ఇంక, హారం సంగతి చెప్పాలా. అయితే నువ్వు దాన్ని మార్పుచేయించడం నాకు అంత ఇష్టంలేదు. నువ్వు ఈ హారాన్ని ధరించడం, ఆరంభించిన, నెల్లాళ్ళలో నీ అదృష్టం, పూర్తిగా తిరిగిపోకపోతే అప్పుడు నన్ను అడుగు." అంటూ మళ్ళీ ఆహారాన్ని పరిశీలించడం సాగించేడు.

# ★ హస్తసాముద్రికం ★

అనకాపల్లి స్టేషను దగ్గరపడుతూంది. పేపర్ని ఆమె చేతికి ఇచ్చి, ఫ్లాస్కులోని కాఫీ తానే పోసుకొని చప్పరించసాగేడు. ఈలోగా లీల మరొకమారు బాత్ రూమ్ లోకి వెళ్ళివచ్చింది. ఇంకా ఏమో ఆమెకు అతన్ని అడగాలనే ఉంది.

"బాబూ! ఆ మధ్యను ఎవరో చెప్పేరు. నాకు ఈ సంవత్సరంలో ఏదో ప్రమాదం, రానున్నదని దాని మాట..."

"చెప్పడానికేంలే, ఏవేవో చెప్తూ ఉంటారు - చెప్పినవన్నీ నమ్మకూడదు. కొందరు ఏవేవో చెప్పి భయపెట్టి శాంతులకని, గ్రహజపాలకని డబ్బు లాగేస్తారు. మన పద్ధతి అదికాదు. చెప్పదలచినదేదో ఖచ్చితంగా చెప్పేస్తాం."

"అయితే బాబూ! మరి నాకిప్పట్లో మరేం ప్రమాదం లేదంటారా?"

"నే నటువంటి దృష్టితోనే చూడలేదు. అయినా నీ వింతగా అంటున్నావు కాబట్టి మళ్ళీ జాగ్రత్తగా చూస్తాను. అనకాపల్లి స్టేషను వచ్చివస్తుంది. స్టేషను దాటిపోనీ మళ్ళీ చూసుకుందాం."

చేతిని ముందుకు చాపి రైలు కదిలేవేళ వరకు అతి ఆతృతగా ఎదురుచూస్తూ కూర్చుంది లీల. రైలు కదిలిందికాని, మరి ఆమె చేయి చూసే భాగ్యం, కలగనేలేదు సన్యాసిరాజుగారికి.

రైలు కదిలిన తరువాత పరిగెత్తుకుంటూ అందుకొని ఎక్కేరు, ముందుగా కామేశ్వరరావు తరువాత అతని స్నేహితుడు సుందరరావున్నూ. వాళ్లు బండిలోపలికి వచ్చి కొంచెంసేపు ఏమీ మాట్లాడకుండా తలుపు దగ్గరే నిలబడి ఉన్నారు. రైలు స్టేషను ప్రాంతాలను దాటిపోయింది. ఇక ప్రారంభమయింది రభస.

కామేశ్వరరావు, సుందరరావు, తమ వేషాలు బాగానే కుదుర్చుకున్నట్లు ఉన్నారు - తన భార్య ఇంకొకడితో వ్యభిచరించగా ఆగ్రహోదగ్రుడైన భర్తలా కామేశ్వరరావు జరిగిందేదో జరిగిపోయిందిలే ఇప్పుడు శాంతించమనే మధ్యవర్తినిగా సుందరరావు.

లీల కిదేమీ అర్థంకాలేదు. ఆమె ఏదో మాట్లాడబోయింది. కామేశ్వరరావు ఆమెను మాట్లాడనీయకుండా నోరుమూసి, అతలి చెవిమీదికి విసరి, "నోరు విప్పేవంటే చంపేస్తా" నన్నాడు. ఆమె మొగాన్ని చేతుల్లో కప్పుకొని వెక్కివెక్కి ఏడవసాగింది.

"సన్యాసిరాజుగారు ఏమీ చలించలేదు. శాంతంగా "అబ్బాయిలూ ఎందుకలా ఆవేశ పడతారు. ఆ అమ్మాయి నా కూతురులాంటిది. ఏదో సరదాకొద్దీ అడిగితే చేయిచూసి ఫలితాలు చెప్తున్నాను." అని ఈ విషయంలో తను చెప్పవలసింది మరింకేమీ లేనట్లు, చుట్టతీసి నిదానంగా ముట్టించేడు. సుందరరావు, "అంటే పాణిగ్రహణం చేసేరన్నమాట. అవకాశం, వచ్చేవరకూ అందరూ సదాచారులే. అయినా పట్టపగలు; మట్టమధ్యాహ్నం; ఇంత ఘోరకలి ఉంటుందనుకోలేదు" అన్నాడు.

కామేశ్వరరావు మరీ విజృంభించేడు. సుందరరావేగాని అడ్డంగా ఉండకపోతే ఇద్దర్నీ అక్కడే హతమార్చి ఉండునని అన్నాడు. సుందరరావు అతన్ని శాంతిపరుస్తున్నట్లుగా "ఎందుకుభాయ్! మొదటే దండప్రయోగం. ఇతర పద్ధతులున్నాయి కదా అవన్నీ విఫలమైతే అప్పుడుచూదాం. ధర్మాన్ని కాపాడ్డానికి గవర్నమెంటువారు ఏర్పాటుచేసిన కోర్టులున్నాయి; పోలీసు సిబ్బందిఉంది. ఏ ప్లీడరుకో, ఒక్క ఏభై రూపాయిలు ఫీజుపారేస్తేసరి, నష్టపరిహారం, విషయం, విడాకుల విషయం, దానంతటదే తేలిపోతుంది"

ఈ మారు సన్యాసిరాజుగారు భయంతో వణకుతూ "బాబ్బాబు! ఆ అప్రతిష్ఠమాత్రం తేకండి. 'పరువుగలవానికి, అపకీర్తి, చావుకంటే ఎక్కువ దన్నాడు' గీతలో శ్రీకృష్ణ భగవానుడు. అయినా దైవసాక్షిగా చెప్తున్నాను మరొకమారు ఆ అమ్మాయిని నేనేం బలవంతం చేయలేదుకదా? చేసిఉంటే ఆమే మీతో స్వయంగా చెప్పిఉండేది. ఇక నన్ను చూచి, వలచిపోయిందంటారా? ఈ వయస్సులో ఈ ఆకారంతోఉన్న నేను ఆమెకంటికి నవమన్మథుడులా కనిపించి ఉంటానా?"

కామేశ్వరరావు చెయ్యి చేసుకో బోయినంత పనిచేసేడు. సుందరరావు అతన్ని బలవంతంగా కూర్చోబెట్టి, సన్యాసిరాజుగారి దగ్గరికివచ్చి కూర్చొని, పరిష్కారమార్గాన్ని చర్చను చేయసాగేడు.

అతను సూచించిన పరిష్కారమార్గానికి, సన్యాసిరాజుగారు అతి విచారంగా అంగీకరించక తప్పిందికాదు.

కామేశ్వరరావుకూడా తనకోపం, తగ్గకపోయినా అయిష్టంగాఉన్నా, కేవలం ఆత్మమిత్రుడు సుందరరావు చెప్పేడుకదా అని ఎలాగో అంగీకరించేడు.

ఫలితంగా సన్యాసిరాజుగారు, దొంగల పాలుగాకుండా చొక్కాలోపల బాడీ జేబులో అతి భద్రంగా దాచుకున్న మనీపర్సునుతీసి అందులోని పది, వందరూపాయల కాగితాలనుతీసి సుందరరావు చేతికిచ్చేడు. అతను వాటిని తీసుకొని కామేశ్వరరావు చేతికిచ్చి మళ్ళీవచ్చి, సన్యాసిరాజుగారి పక్కనుకూర్చొని పరామర్శ ప్రారంభించేడు. "బాబూ! తమ ప్రయాణఖర్చులకు డబ్బు మిగిలిఉందా?"

సన్యాసిరాజుగారు నిస్పృహ చేసుకున్నట్లుగా "ఏదోబాబూ! నీ దయవల్ల కోర్టులంటతిరిగి అపకీర్తిపాలయేకర్మం, తప్పింది. నేను మొదటనుంచీ భయపడుతు నే ఉన్నాను ఆ రాహు, కేతువులిద్దరూ నన్ను సులభంగా విడిచిపెట్టరని. ఇంతకాలం, గౌరవంగా బ్రతికి పెద్దవాళ్ళయిన, కొడుకులూ కూతుళ్లూ ఉండి, ఒకరైలు ప్రయాణంలో, నీచంగా, అవినీతికరంగా ప్రవర్తించినట్లు కోర్టులవెంట తిరిగి, సాక్ష్యాలు సంపన్నాలు సమకూర్చుకొనే ప్రారబ్ధం తప్పింది. అక్కడికి అంతే చాలును. అక్కడ బరంపురంలో పెళ్లివాళ్లకూ మాకూ చాలాకాలంగా స్నేహం, నిజానికి నేను వాళ్ళకి కొంత ఋణపడి ఉన్నాను. అందుకని పెళ్లిలో కట్నం చదివించాలని ఈడబ్బు పట్టుకున్నాను. మా కుర్రవాళ్లు ఇద్దరూ వచ్చారుకారు. వాళ్లు వచ్చిఉంటే, వాళ్ల చేతికి ఇచ్చి నేను ప్రయాణం, మానుకొని, ఉండేవాడిని, అయినా ఈ వెయ్యిరూపాయలతో వాళ్ళ ఋణంనుండి విముక్తుణ్ణి కావటం, భగవంతుడికి ఇష్టం లేదేమో. మరింక నేనక్కడికివెళ్లి, ఏం ప్రయోజనం? వాల్తేరులోదిగి ఇంటికి తిరిగిపోతాను. మా ఆవిడ చెప్పినట్లు ఏదో బంగారపు వస్తువు కొని, ఇన్షూర్యారుచేసి పంపించేస్తాను." అని ఉత్తరీయంతో మొగం తుడుచుకొని తల కిటికీవంకకు తిప్పుకొని, దిగులుగా కూర్చున్నారు. సుందరరావుకి ఆయనతో మరి మాట్లాడేపని లేకపోయింది. వెళ్లి కామేశ్వరరావు ప్రక్కన కూర్చున్నాడు. ఇద్దరూ కులాసాగా కళ్ళతోనే మాట్లాడుకోసాగారు. లీల వాళ్లవంకచూసి ఏదో మాట్లాడబోయింది. సుందరరావు ఆమెను వారించి "ఊరుకో లీలా! వాళ్లిద్దర్నీ ఒప్పించి పరిష్కారం కుదిర్చేసరికి తల ప్రాణం తోక్కవచ్చింది. ఇప్పుడు నీవేమైనా అంటే అంతా మళ్ళీ మొదటికి వస్తుంది. ఇంతకీ, మీ పొరపాటేమీ లేదే అనుకో, అయినా ఆయనకిలేని విచారం, నీకెందుకు? అయినా ఇందుకు మనంగాని ఆయనగాని కర్తలం కాముకదా, అంతా ఆ రాహుకేతువులు మనల నందర్నీయిలా ఆడించిన ఫలితం", అంటూ వికటంగా నవ్వాడు. అతని ఈమాటకి కామేశ్వరరావు మొగం చేటంతయింది. లీలకు

మాత్రం, యిదేం నచ్చలేదు కాని చేసే దేమీ లేక, తల కిటికీ వంకకు త్రిప్పుకొని కూర్చుంది

వాల్తేరు స్టేషను సమీపిస్తూవుండగా సుందర్రావు మళ్ళీ సన్యాసిరాజుగారి వద్దకు చేరి అతన్ని నోదార్చ సాగేడు సన్యాసిరాజుగారు అంత నిరుత్సాహపడినట్లు లేరు "ఏం చేస్తాం? నాయనా!, అంతా గ్రహచారం, భగవద్విలాసం, నాయనా!" అని తను సంచీని మరి కొంచెం దగ్గరగా తీసుకొని కూర్చున్నారు

స్టేషనుయార్డునుదాటి రైలు ప్లాట్‌ఫారం సమీపిస్తున్నది సన్యాసిరాజుగారు లేచి, తలుపునకు వీపు ఆనించి నిలబడి అన్నాడు ఈమారు ఆయన గొంతు అదివరకటిలాగే కాక ఖంగుమని మ్రోగింది

"మీకు తెలియదుగాని మనం, తరుచు కలుస్తూవుండవలసిన వాళ్ళమే ఇంత సేపూ మీవంతు అయింది ఇకను నేనూ ఒకచిన్న గమ్మత్తు చేస్తాను" అతను యీ మాటలు అంటూవుండగా ముగ్గురూ వొళ్ళంతా కళ్లు చేసుకొని అతనివేపు చూడసాగారు

సన్యాసిరాజుగారు "ఇదేం అవసరంలేదు కానీ, మీలాగే, నాకూ నాటకం అంటే సరదా అంచేత" - అని సంచీలో నుండి చుట్టలడొక్కు తీసినంత సహజంగా రివాల్వరు తీసి పట్టుకొని "హేండ్సు అప్! కదలకండి స్టేషనుకూడా వచ్చేసింది అని కొంచెం నవ్వుతూ "చెప్పేను కదూ, ఇది వట్టి అనవసరమైన నాటకమని నా మానాన నేను మాట్లాడకుండా దిగిపోయినాచాలును కానీ రివాల్వరును బైటికి తీయకుండావుండడానికి మనస్కరించలేదు" అని వెనకనించే తలుపు తెరచి క్రిందంట ప్లాటుఫారం వంక చూసి "అరుగో మీ స్నేహితులు, సామర్లకోటలో యిచ్చిన వైరు, వృథాపోలేదు" అన్నాడు

కామేశ్వర్రావు ఆఖరిప్రయత్నం చేయబోయేడు, సన్యాసిరాజుగార్ని, తోసుకొని తప్పించుకు పారిపోవాలని, కాని, సన్యాసిరాజుగారి ఎడంచేతిపోటు అతన్ని వెనక్కి తూలిపడేలా చేసింది సన్యాసిరాజుగారు దిగి క్రిందనున్న పోలీసు ఇనస్పెక్టరుతో హారం, ఆమె దగ్గరే ఉంది అయితే ఇందులో నా మదుపుకూడా వెయ్యి రూపాయలు ఉంది సుమండి"—

ముగ్గుర్నీ బంధించి రైల్వే పోలీసు స్టేషనుకు తీసుకొని వెళ్ళిపోయేరు

పోలీసు ఇనస్పెక్టరు సన్యాసిరాజుగార్ని స్తోత్రపాఠాలతో ఉక్కిరిబిక్కిరి చేయసాగేడు సన్యాసిరాజుగారు, చాలా సామాన్యంగా "నీకు చెప్పలేదటయ్యా! నీకు ఆరునెలల్లో ప్రొమోషను వస్తుందని, ఈ దెబ్బతో తప్పకుండా వస్తుందిలే" అన్నాడు

పోలీసు ఇనస్పెక్టరు, "ఇందులో మాదేముంది లెండి అరటిపండు ఒలిచి చేతిలో పెట్టినట్టు, మీరు ముగురిని మా చేతిలోకి అప్పజెప్పేరు అయితే మీరు సామర్లకోటలోనే ఎందుకు వాళ్ళను పట్టుకోలేదు?"

"అదా? అప్పటి కింకా హారం, సంగతి ఏమీ తేలందే, నాదగ్గర పర్సులో ఉన్న డబ్బునుచూసి, వాళ్ళకు ఒక నాటకం, ఆడాలని బుద్ధిపుట్టింది, నాకూ అది మంచిదే అయింది. సాముద్రిక ప్రస్తావనలో హారం సంగతి స్పష్టంగా తెచ్చి, కళ్ళతో చూడ్డానికి వీలైంది లేకపోయినా విలువైన రాళ్లనీ గురించిన ప్రస్తావన తెచ్చి వాళ్ళ ముఖ కవళికలనుబట్టి వాళ్ళదగ్గర ఉందో లేదో కనిపెట్టి ఉండేవాడిని అయితే అంత అవసరం, లేకపోయింది పాపం, ఆ అమ్మాయికి వాళ్లు ఆడే నాటకం అర్థం కాలేదు, నే నాడే నాటకం, వాళ్లకి బోధపడలేదు వాళ్లదగ్గర పెద్ద హారం, అయితే ఉంది కాని, పై ఖర్చులకి అట్టే డబ్బులేదని నాకు తెలుసును అంచేత నాదగ్గర డబ్బు ఉన్నదంటే వాళ్లు మన మనుష్యులే అయితే తప్పక కక్కుర్తిపడి తీరాలి" అంతా అనుకున్నట్టే జరిగింది

సరదాకి నేర్చుకున్న హస్తసాముద్రికం, ఈనాటికి ఈ విధంగాకూడా వినియోగించింది అయితే ఆ అమ్మాయికి ఏదో పెద్ద సినిమాస్టారు నయిపోదామన్న కోరికే తప్ప జరిగిన కూనీతో అట్టే సంబంధం లేదు అయితే కొంతవరకు వీళ్లతో లాలూచీ పడక పోలేదు అయితే వీళ్ళూ ఘటికులే ఒకవేళ పట్టుబడినా, వస్తువు ఆమె దగ్గర ఉంటుంది కనక తాము తప్పుకోవచ్చు ననుకున్నారు ఏమైనా ఆ అమ్మాయికి అట్టే కఠినమైన శిక్ష పడేలా నేరం మోపకండి, నిజంగానే ఆమె చేతిలో మంచి భవిష్యత్తునే సూచించే రేఖలున్నాయి ఈ శిక్ష ఏదో అయి, బయటపడి బాగుపడుతుందేమో? అప్పుడు వెళ్ళి అడిగి నా హస్తసాముద్రిక ఫలితానికి ఫీజు పుచ్చుకుంటాను ★



బొమ్మల కొలువులో రామాయణగాథ

# శరన్నవరాత్రులు: బొమ్మల కొలువు

ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి మొదలు మహా నవమివరకూ దేవీ నవరాత్రులు, లేక శరన్న వరాత్రులు. ఆ పైన పదవరోజు విజయ దశమి. దశమికి దశహార అను పేరునుబట్టి దసరాపండుగ పేరవచ్చింది శరదృతువులో ప్రారంభమైన ఉత్సవాలు కాబట్టి శరన్నవ రాత్రులనికూడా మొదటి తొమ్మిది రోజు లకూ నేక లక్ష్మి, సరస్వతి, పార్వతి గార్లయొక్క అవతారాలే నమ్మకతో ఈ తొమ్మిరోజులూ దేవీపూజలు జరపుతారు ఎనిమిదవరోజు దుర్గాష్టమి, తొమ్మిదవ రోజు మహానవమి దుష్టశక్తులపై దివ్య శక్తుల విజయచిహ్నంగా విజయదశమినాడు ఆయుధపూజ చేస్తారు తొమ్మిదిరోజులు ఘోరయుద్ధంచేసి దుర్గామహాశక్తి ఆరోజున మహిషాసురుని వధించి దేవతలను సకల లోకాలను ఉద్ధరించిందని పురాణగాథ

దసరాపండుగకు మనదేశంలో బడిపిల్లలు విల్లంబులు, బుక్కాసంచులతో ఉపాధ్యా యులవెంట బయలుదేరి గృహస్థులనుదర్శించి 'పిల్లవాళ్లకుచాలు పప్పుబెల్లాలు, అయ్య వారికిచాలు ఐదువరహాలు' అంటూ ఉపా ధ్యాయులకు రాబడి కలుగచేస్తారు

బొమ్మలకొలువు సాధారణంగా మన దేశంలో సంక్రాంతికేగాని దసరాపండు గల్లో పెట్టరు కాని దక్షిణాదిని దసరాకే పెద్ద ఆర్భాటంతో కొలువులు పెడతారు పూర్వం ఇవి ఎలా ఉండేవో తెలియదు కాని ఈరోజుల్లో మాత్రం ఆధునిక సదుపా యాల తోడ్పాటుతో పురాగాథలను ఆధునిక జాతీయచరిత్రకు సంబంధించిన బొమ్మలను పెడుతున్నారు ఇవి ఎగ్జిబిషన్ రోజులు. ఏవిషయాన్ని ప్రచారం చెయ్యా లన్నా దీనికి మించిన చక్కని పద్ధతులేదు.

శ్రీ రామపట్టాభిషేకం

ఈ పుటలలోనూ, తరువాత పుటలలోనూ ప్రచురించబడిన బొమ్మల కొలువుల ఫొటోలను పంపినవారు శ్రీమతి బి. వత్సల, మద్రాసు. వీనిలో రామాయణ గాథ, జాతీయోద్యమ చరిత్ర విపులంగా చిత్రించబడినవి.



జటాయుమోక్షం, సీతావనవాసం

# దసరా విడ్డూరాలు

అక్టోబరు సెలవులు. కాలేజిలో క్వార్టర్లీ పరీక్షలైపోయి శ్రమపడిన ప్రాణాలు కుదుటపడ్తున్న చల్లని దినాలు. ఖానా ముగించి అవీ యివీ మేగజైన్లు తిరగేస్తూ అలానే పడి నిద్రపోయాను. పగటినిద్ర పనికిరాదంటారే కానీ, సుఖపడ్డానికి తెలీని వాళ్ళనే మాటలవి! సెలవురోజుల్లో, మధ్యాహ్నంపూట 'భేవు' మని త్రేన్చి మేను వాల్చి, యేదో ఓ చెత్తపుస్తకం తిరగేస్తూ తెలీకుండానే నిద్రపోడంలోని మజా అనుభవించేవాళ్ళకే తెలియాలి!

అలా ఎంతసేపు నిద్రపోయానో తెలీదు. ఇంతలో "ఢాం ఢా"మ్మని మొదట చాలా దూరంగా పోను పోను బ్రహ్మాండాలు బ్రద్ధలయ్యేలా వినిపించేసరికి చివాల్న లేచాను. "ఒరే! అబ్బాయ్...! ఒరేయ్!...అయినా యిదేంనిద్రబ్బా. చదువుకునే పిల్లలు వేళా పాళా లేకుండా?... రేయ్!..."

"ఆ ఆ...! శాంతించండి శాంతించండి!" అంటూ తలుపుతీశాను నిద్రమత్తులో తడబడుతూ.

"అదేం నిద్దరరా మరీనూ? ఘంటసేపట్నుంచీ తలుపులు బాదుతుంటే ఓతట్టు కుంభకర్ణుడికి..."

"ఆగండాగండి. మా మేనమామసంగతి చెప్తున్నారల్లేవుంది!" అంటూ ఓ జోక్ వెలిగించాను.

"ఏడ్చావ్! పద పద, నీ గదొక్కటే మిగిలింది. గోడలకి వెల్ల వేయాలి. పనివాళ్ళిలా కాచుకోనున్నారు" నిద్రకండ్లను నులుముకొని చూద్దునుకదా ఇల్లంతా కురుక్షేత్రంలా వుంది. ఎక్కడి సామాన్లక్కడ - ఓపక్క యిల్లు కడుగుతూన్నారు. మరోపక్క పిండి ముగ్గులు తీరుస్తూంది, జ్యామెట్రీలో దనక్కర్కయిన చిట్టిచెల్లెలు! తమ్ముడు నిచ్చెన

## 'కేసరి'

పట్టుకోనుంటే నాన్న పైకెక్కి చాలా తమాషాగా బేలెన్సుచేస్తూ మేకు గోడలోకి దిగేసి పటాలు తగిలిస్తూన్నాడు హాల్లో—నాకు పట్టరాని నవ్వొచ్చింది ఆయన భంగిమలు చూస్తూంటే!—పంచ బిగించి బిళ్ళగోచీ పెట్టి కట్టాడు - చొక్కా చేతులు బాగా మడిచాడు పైకి—పటాలు గోడలకి తగిలించడాని కెవ్వరికీ తెలీదనీ, అదో ప్రత్యేకమైన సైన్సని మొదట్నుంచీ కూడా ఆయన సిద్ధాంతం! ఫక్కున నవ్వేసరికి నాతట్టాయన తిరిగి చూచాడు. ఆ చూడ్డంలో చెల్లి అందిస్తూన్న పటం కాస్త పట్టు తప్పింది. పటం కింద పడ్తుందన్న గాబరాలో రెండో చేతిలోని సుత్తెకూడా తప్పి ముందర పటం, దానిమీద సుత్తె పడ్డాయి. దీంతో చెల్లాయ్ కెవ్వుమని దూరంగా గెంతింది. తమ్ముడు నిచ్చెన్ను వదల్లేదు కానీ వదిల్నంత పని చేశాడు!

"అమ్మో! అమ్మో! చాల్లెండి మీ నిర్వాకం!...మీరూ కింద పడేరు! వాళ్ళ నెత్తిన అవి పడుంటే ఇంకేమన్నా వుందా? ...ఏమే, మీ కేమైనా తగిలిందేమిటి గాజు పెంకులు?...చ చ్చు! మంచి పటాన్ని తగలేశారు" అంటూ నాన్నను చల్లగా చీవాట్లు పెడ్తూందమ్మ.

"చాల్చాల్లే అట్టే వాగకు!...నీకూతురు చక్కా అందిస్తేగా? నాజూగ్గా కులుకుతూ అందీసం ఆయె!..." అని చెల్లాయ్‌మీద రుద్దేడానికి చూస్తూంటే,

"అదుగో యిందుకేమ్మా నేనొక్క పని చేయను నాన్నంటే, ప్రతిదీ నా మీదికి తెస్తాడు" అంటూ చెల్లి అమ్మ దగ్గర మొర పెట్టుకుంది, తెచ్చుకున్న కన్నీళ్ళు తుడుచుకుంటూ.

"చాల్లెండి ఆడలేక మద్దెలమీద పడ్డారట..." నాన్న బిక్కమొగంతో కిందికి దిగాడు.

"జౌన్నాన్నా! పటాలు వేలగట్టడం నిజంగా ఓ ఆర్ట్!" అన్నాను, మహా తెలివిగా మొగం పెట్టి.

నాన్న మొగమింతైంది "ఎలా వుందిరా యిపుడు?" అన్నారుత్సాహంగా నాతట్టు తిరిగి.

"నా మొహంలా వుంది! ఒకటి ఎగుడు, ఒకటి దిగుడు" అందమ్మ చురుగ్గా. నాన్నే పని చేసినా చులకన చేయడం అమ్మకో సరదా! ఈ ఆడవాళ్ళే యింత అన్నట్లుగా నాతట్టుచూస్తూ వెళ్ళాడు నాన్న.

సరే యిక వెళ్ళి ముఖం కడుక్కొద్దామని పోబోతున్నాను. ఇంతలో "ఒరే రుూరోయ్ - ఇలా నా కండ్లు పెట్టుకొని మాట్లాడు! నడుములు విరిగేలా పిండి ముగ్గులు పెట్టిందది. తడారకముందే తొక్కి ధ్వంసం చేయకండి," అని మందలించేసరికి, నేనో చిన్న కుప్పి గంతేసి ఆ ప్రమాదాన్నుండి తప్పుకున్నాను - కాళ్ళకి కండ్లీయని దేముణ్ణి దూరుతూ!



పుత్రకామేష్టియాగం, సీతారామలక్ష్మణ వనవాసం

మొగం కడుక్కొని యింట్లో కాలు పెట్టే సరికి యూ. ఎన్. ఓ. లోలా బ్రహ్మాండమైన వాగ్యుద్ధం జరుగుతూందింట్లో!

"అక్కడ కాదండీ!.. ఆ బొమ్మక్కడుండాలి, ఇదీ అదీ జతగా కొన్నాం మేము" అంటుందమ్మ.

"నీకు తెలీదుండవే! ఆ బొమ్మక్కడుంటేనే బాగుంటుంది. ఈ రెంటికీ సిమెట్రీ కుదిరింది" అంటూ నాతట్టు చూచారు, నా సపోర్టుకోసం.

"కాదు నాన్నా అదక్కడే వుండాలి" చిట్టి అభిప్రాయం.

"భాభా! యిక్కడే సరిపోయింది"

"అబ్బబ్బా! మీ కెందుకండీ ఆడవాళ్లతో పోరు? ఎట్లాగట్లా మేం సర్దుకుంటాం, .. ఇప్పటికే నాలుగు బొమ్మలు విరిచి కుప్పెట్టారు, మీరూ మీ కొడుకూనూ..."

"ఒహోహో! నీవు మాత్రం తక్కువా! నీవూ నీకూతురూ చేరి ఓ బొమ్మకి చెయ్యి విరిచారు, ఒకదానికి ముక్కూ, మరోదానికి నడుమూ..."

"మీతో యెందుకీ వెధవ్వాదన్లు... !"

"అదుగో...అదుగో!......ఆ దుడుకు మాటలే వద్దంటాను వెధవ్వాదన్లేంటి? నేను వెధవనా?"

"మిమ్మల్నేం అనలా నేను"

"నన్ను కాపంటే యెవర్నంటి?"

"ఛా నాన్నా! వెధవ్వాదన్లు - ఇది షష్ఠీ తత్పురుషసమాసం నాన్నా - వెధవయొక్క



# పరిశ్రమ ప్రాముఖ్యతను నిరూపించుటెట్లు?

*సామాన్యమానవునకు సైకిలు, కుట్టుపని మిషను, హరికేను లాంతరుతో పాటు ఉక్కు కడ్డీని చూపినట్లయిన తను మరొకసారి ఉక్కు కడ్డీవైపు తిరిగి చూడడు. అయినప్పటికి మెషీన్లకు, కట్టడాలకు, ఫ్యాక్టరీలకు... మనము నిత్యమూ వాడుకొను చాల వస్తువులను తయారుచేయుటకు... ఉక్కు తప్పనిసరిగా కావలెను.*

భారతీయ ఉక్కు పరిశ్రమను స్థాపించి అర్ధశతాబ్దమైనా కాకపోయినా, నేడది జాతీయ అర్థిక వ్యవస్థలో అత్యంత ప్రాముఖ్యమైయున్నది. సాలీనా దాదాపు 17½ లక్షల టన్నుల వుక్కును, మరేదేశము వుత్పత్తి చేయజాలని ధరకు వుత్పత్తి చేయుచున్నది. యిందు తాతా వుత్పత్తి 10 లక్షల టన్నులకు పైగా యున్నది. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ప్రథమ దశలోనే ఉక్కు వుత్పత్తిని సాలీనా 20 లక్షల టన్నులకు పెంచుట తాతా కంపెనీ వుద్దేశము.

దేశాభ్యున్నతికి ప్రయివేటు సంస్థ అవిరామ కృషి

**ది తాతా ఐరన్ అండ్ స్టీల్ కంపెనీ లిమిటెడ్**

# ★ దసరా విడ్డూరాలు ★

చిరాగ్గా. నాన్న నిస్పృహతో భుజాలెగ రేసి నిష్క్రమించాడు రంగంలోంచి.

"అమ్మోయ్! మాకేమన్నా కాఫీలు, గీఫీలున్నాయా లేక అత్తారింటికి (అంటే కోటలికి) పొమ్మంటారా?".



"ఇదుగో నాకు చెయితీరడంలా చూస్తున్నావుగా? నన్నేం వుపద్రవపెట్టకండి! వంటింట్లో మూసిపెట్టున్నాయి-కాఫీలు గీఫీలు అన్నీ."

"హా రావణా!" అనుకుంటూ బయల్దేరాను వంటింట్లోకి.

కాఫీ ఫలహారాలు ముగించి నా రూంలోకి పోయిచూద్దునుకదా-ఇంకేముంది?-నా ట్రంకుపెట్టి కాస్తా అమాంతంమాయమైంది!

"అమ్మా!...ఓమ్మా!...నా పెట్టేమైందేమ్మా?..."

"ఒరేయ్ సాయంత్రప్పూట ఆ గావుకేకలేమిట్రా? నీ పెట్టె కొలువు అంతస్తులో పెట్టాం...ఇప్పుడు దాన్ని కదిలించడానికి వీలుకాదు" అని హుకుం జారీ చేసింది. ఔనెంతమాత్రం వల్ల కాదంది చెల్లాయ్!.

"మరి...మరి... నా గుడ్డలే...?..?...?"

"గుడ్డలా దండెంమీదేశాం, నీ షెల్ఫులోనే సర్దుకో ఈ పదిరోజులూ..."

"......................"

"అమ్మోవ్...!"

"అబ్బ నీకేకగట్రా చెప్పడం పండగపూట అలా కేకలెట్టకని..."

"అది కాదే నా పంచెలేమ్మా?—నా పంచెలేమైనాయే?" యీ చింపుడ్డొక్కటి మిగిలింది..."

"నీ పంచెల్ని అంతస్థులమీద పరిచాంలేరా! పైజామాలున్నాయిగా...మహాపంచెలతోనే వూరేగేవాడిలా! తిండికి కూడా పాంట్లతో దిగబడేవాడివి..."

హరి భగవాన్ ఈ పండగలు పదిరోజులూ మగపురుగులింట్లో వుండలేరు. సొంత ఇంట్లోనే కాందిశీకులైపోవలసిందే. ఇక్కడడుగు పెట్టకూడదు, అక్కడికి పోకూడదు, ఇది తాకకూడదు, అది చూడకూడదు. సరి సరి, బొమ్మలు పెట్టిన హాలు చుట్టూ పదడుగుల దూరం 'నో మాన్స్ లేండ్'గా డిక్లేరు చేసేసింది చెల్లాయ్! అక్కడెవ్వరు ట్రెస్పాస్ చేసినా, ప్రమాదం ప్రమాదమంటూ చిందులు వేస్తుంది. సరే ఇక తప్పటడుగులు వేస్తూన్న చిన్నవాడు కూడా విరోధివర్గంలో ఒకడుగా ప్రకటింపబడ్డాడు! కొలువు కూటంలోకి పోతే చాలు వెంటనే హుంకరిస్తూ గ్రద్దలా వాడిమీదికివాలి "ఇంకేముంది? ఇంకైనట్లే! అదో-అక్కడ పార్కుని ధ్వంసం చేసేస్తున్నాడు, కొండల్ని పిండి చేస్తూన్నాడు అదుగో అక్కడఅంగట్లో శెట్టి నెత్తుకుపోయాడు" చిట్టివాడో తట్టు బొమ్మలకోస మొకటే గోల! పసిపిల్లలేమొ పండుగ పదిరోజులుందనప్పట్నించి 'బొమ్మల పండె గెప్పుడే? బొమ్మ లెపుడు పెడ్తారే' అని ఒకటే వుబలాట పడ్తూంటారు కదా? తీరా పండుగ

లొచ్చేటప్పటికి పిల్లల్ని లా బొమ్మల దగ్గరికి పోనీరు – వాళ్ల గాలి సోకితే కూడా అవి పగిలిపోతా యంటూ! పేరేమో 'పిల్లలపండుగ!' కాని సంబరాలన్నీ పెద్దలవే! 'పిల్లల పండుగ' అనే కంటే 'అమ్మలక్కల పండుగ'నో లేక 'అమ్మాయిల పండుగనో' అంటే సరిపోతుందేమో!

పండుగ పదిరోజుల్లో ప్రతిరాత్రి భోజనాలవేళ – "అమ్మోవ్! వాళ్ళ ఊర్మిళ కట్టుకొచ్చింది చూచావు గామ్మా – ఫ్రెంచి చిఫాన్ చీర..."

"అదిసరే, పంకజమ్మ చిన్నమ్మాయి వేసుకొచ్చిన నెక్లెసు చూచావా? నాలుగు సవరేనట – ఏమండోయ్! దాని మెళ్లో అలాంటి నెక్లెసైతే బాగుంటుందండి..."

"కానీలేమ్మా! నెక్లెసుట...నెక్లెసు! నాలుగు నెల్లుగా వెల్వెట్ జాకెట్ కొనీమ్మంటున్నాను...అమ్మా! గజం పదహారు రూపాయలేనట్నే (!) పండుగల్లోపల్నే, ఓ వెల్వెట్ జాకెట్టేమ్మా!"

నాన్న దేనికీ సమాధానం చెప్పడు! నాన్నకి తెలుసు – ఎన్నేళ్లుగా ఏ ఏ కోరిక లెలా కోరబడిందీ, ఏ విధంగా యింతవరకూ ఆ కోరికలు తీర్చందానివల్ల వాళ్ళ గుండెలు 'ద్రవించి, స్రవించి నశించి' పోతుండేదీ ఏకధాటిగా ఏకరువు పెడ్తారు, యింకొ ముదిరితే రాగయుక్తంగా కూడా!

ఎంత కాదు కాదంటూన్నా నాన్న మెడకి డోలు తగిలించి, ఇప్పటికే కొనే కొత్త – అమ్మో చీర, చెల్లాయో మైసూర్ సిల్కు పరికిణీ పావడా యిలాంటివి. ఇంక వీధిలో గాజులశెట్టి, రిబ్బన్లవాడు పోయి నప్పుడల్లా, యింట్లో తిష్ఠవేసి సినిమాలూ, సినిమా పత్రికల తిరునామాలూ, వల్లించి ఒకటో రెండో వొలుమకుపోతూంటారు. వాన్నేమో వైటమిన్ 'ఎమ్' తక్కువై మకతిక, తికమక పడి 'ఫారిన్ ఎయిడ్'కి అప్లై చేస్తాడు 'ఏదీ గతి నాకు?' అంటూ!

పండుగరోజులు కదా, తృప్తిగా తిని, కంటినిండా నిద్రపోవడానికి వీల్లేదు! ఒక్క కునుకు తీసేప్పటికే 'ఒరే అబ్బాయీ! అలా మార్కెట్టెళ్ళి ఓ పావలాకి తమలపాకులు, పదిపలాలు చూరలు, పసుపూ, రెండు మల్లె చెండ్లూ పట్టుకరారా' అనో 'ఒరేయ్ శెట్టి అంగట్లో ఒక వీసె సెనగపిండి, నువ్వుల నూనోపడి పట్టుకరా' అనో పురమాయిస్తుంది. కాళ్లకి బలపాలు కట్టుకోవలసిందే యిక.

మరిక సాయంత్రం నాల్గుగంటల్నించి రాత్రి తొమ్మిదింటిదాకా మగపురుగింట్లో కాలుపెట్టడానికి హక్కులేదు. ఏ పార్కుచెట్టుకిందో, ఏ ఏట్లోకో, బీచ్‌కో పోయి బిక్కు బిక్కు మంటూండవలసిందే! ఇంట్లో నీ గదిలోపడి తలుపును బిగించుకుందా మనుకున్నా వుండనిస్తారా ఏం" ఉహూఁ! ఏదో చేసింది యింతింత పొట్లాలు కట్టమనో, లేకుంటే 'ఒరేబ్బాయ్ ఓ క్షణం పాపణ్ణి పట్టుకోనుందూ, వాళ్లు పోయొస్తామంటున్నారు, తాంబూలా లీయాలి – వీడొకటే మయిన గోల చేస్తున్నాడు, చేయీ కాలూ ఆణీక...నాయనా యన! ఒక్క క్షణం!" అని చిన్నవాణ్ణి మెడకడ్తారు!. తప్పిపోయి "చిట్టెని పెట్టుకోనుండమన్నాదామ్మా!" అన్నావనుకో–, "అదేమిట్రా — అదే మూరికే వుండా యేమిటి? — వచ్చిన నలుగురికీ పసుపూ గంధం అందిస్తూంది" — అని కూతుర్ని వెనకేసుకొస్తుంది. ఇహ ఖర్మంచాలక గది తలుపు తీశావా — రామ రామ— కోయిల స్వరం మొదలు మార్జాలకూత (తెలుగు పండితులు క్షమింతురుగాక) దాకా చిత్రవిచిత్రమైన శబ్దాలు తేజారెత్తిస్తాయి ప్రాణాలను! అందులోనూ నీకు కాస్త వచ్చినపాటను, అలా తెలిసి తెలిసి, హత్య చేస్తూంటేఓర్చుకోలేక "హతోస్మి, హతోస్మి, రక్షించండి, శరణు, శరణు" అని బిగ్గరగా అరవాలనిపిస్తుంది! గదిలో ఉక్క వేసి బయటకి వచ్చావంటే— అక్కడ సమావేశమైన టెక్నికలర్ వ్యక్తులు— "ఈ మగ కటకం యిక్కడెందుకున్నట్లు" అన్నట్లుగా చూస్తారు వాళ్లెందుకో – బొమ్మల పండుగ పూర్తిగా వాళ్లదైనట్లుగా!

ప్చ్! ... ఎందుకులే...? యింతకీ మగ వాళ్ళు పదిరోజులూ రఘ్యూజీస్ లా, 'సత్రంలో భుక్తి, మఠంలో నిద్ర' అన్నట్లు గడపాల్సిందే...!





ఫొటోలు పంపిన వారు బి. వత్సల, మద్రాసు.




# హిందూస్త్రీల వారసత్వాధికారము

భారతదేశములో మానవధర్మ సూత్రాలు గౌతమఋషిచేత లోకానికి ప్రబోధింపబడ్డాయని శాస్త్రప్రమాణము. మను ధర్మశాస్త్రము క్రీస్తుకు పూర్వము రెండవ శతాబ్దములోను, యాజ్ఞవల్క్య సంహిత క్రీస్తుశకము మొదటి శతాబ్దములోను వ్రాయబడినవని నిర్ణయింపబడ్డది. అంతకు పూర్వము ప్రజల శాసనాలను గురించీ, సాంఘికాచారాలనుగురించీ ప్రామాణికమైన చరిత్రలేదు. రాజుల పరిపాలనను గురించి చరిత్రకారులు వ్రాశారు కాని మానవ ధర్మశాస్త్రాన్ని గురించి వ్రాయలేదు.

మను ధర్మశాస్త్రాన్ననుసరించి స్త్రీకి ఏ విధమయిన అధికారమూ లేదు స్త్రీని బాల్యములో తండ్రి, యౌవనములో భర్త వార్ధక్యములో కుమారుడు పోషించి కాపాడవలసినవారు. 'న స్త్రీ స్వాతంత్ర్యమర్హతి' అని శాసించినవాడు మనువు.

కాని యాజ్ఞవల్క్యుడు స్త్రీలకు కొన్ని హక్కులను కల్పించాడు. వితంతువులకు సమష్టికుటుంబములోను, వ్యష్టికుటుంబములోను, విడివిడిగా హక్కులను కల్పించాడు. సమిష్టి కుటుంబములో మగసంతానములేని వితంతువుకు, ఆ కుటుంబ గౌరవానికి తగినట్టుగా, మనోవర్తి ఇచ్చే ఏర్పాటుచేశాడు. విభక్త కుటుంబములో మగసంతానములేని వితంతువుకు, పెనిమిటి ఆస్తిపై అనుభవాధికారము మాత్రము కల్పించాడు.

## ఇల్లిందల సరస్వతీదేవి

11 వ శతాబ్దములో హిందూధర్మశాస్త్రానికి విజ్ఞానేశ్వరుడు భాష్యము వ్రాశాడు. ఇదే మితాక్షర గ్రంథము. దీనికే మితాక్షరీయమని వాడుక. ఇది యావద్భారతములో వర్తించేది.

మితాక్షరీయము ప్రకారము స్త్రీకి మరి కొన్ని హక్కులు అధికారాలు లభించాయి. వితంతువులకు దత్తతాధికారము కలిగింది. పెనిమిటి ఆస్తిపైన కేవలము అనుభవాధికారమే కాక ఆపత్కాలములోను, అవసర సమయాలలోను, కుటుంబాభ్యుదయానికై, ఆస్తిని వినియోగించే అధికారము స్త్రీకి కల్పింపబడ్డది. దీనిననుసంచి కుమార్తెల వివాహాలకు, కోర్టుఖర్చులకు ఆస్తిలో కొంత భాగము విక్రయించి వినియోగించవచ్చు. భర్తచేసిన ఋణములను (కాలక్షేపముపట్టిన వాటినికూడా) వితంతువులు తీర్చవలసి ఉండేది. ఆస్తిని బాగుపరచే అధికారము కూడా స్త్రీకి లభించింది.

వంగదేశములో మాత్రమే దాయ భాగము అను పద్ధతి అమలులో ఉన్నది. దీని ప్రకారము యావదాస్తి కుటుంబములోని పెద్ద కొడుకు అధీనమై ఉంటుంది. దీనిలోకూడా స్త్రీలకు రవంతభాగమైనా లభించలేదు.

హిందూ ధర్మశాస్త్రములో వారసత్వము రెండు విధాలుగా లభించేది. మొదటిది రక్త సంబంధమూ, రెండవది పిండ సంబంధమైనదీను. పిండ సంబంధమైనది మతాన్ననుస

తించినది. చనిపోయిన వ్యక్తికి సద్గతులు కల్పించటానికిగాను ఆ కుటుంబములోని సన్నిహితులు కర్మకాండ జరుపవలసి ఉంటుంది. చనిపోయిన వ్యక్తికి కుమారులు ఉన్నట్లయితే ఈ భారము వహించవలసిన బాధ్యత వారిదే. వారు లేని పక్షములో విభక్త కుటుంబములో నివసించువు ఈ బాధ్యత వహించేది. విజ్ఞానేశ్వరుని మితాక్షరీయము ఈ విధముగా మత సంబంధాన్ని రక్త సంబంధాన్ని పిండసూత్రాలతో కలిపింది.

భారతదేశ పరిపాలన మహమ్మదీయుల ఆంగ్లేయుల చేతులు మారినప్పటికీ ధర్మశాస్త్రము జోలికి వారెవరూ పోలేదు. అవిచ్ఛిన్నముగా అనుశృతముగా వచ్చిన

# ★ హిందూస్త్రీల వారసత్వాధికారము ★

ఆచారాలు శ్రేయోదాయకములయి ఉంటాయనీ, ఆచారము చట్టముకంటె బలీయమైనదనీ అనుకొన్నారు. మొత్తముమీద ధర్మశాస్త్రములో, ఏ రవంత మార్పుకూ వారెవరూ సాహసించలేదు.

మానవ ధర్మశాస్త్రము సమాజోన్నతిని దృష్టియందుంచుకొని ఏర్పడిన నిబంధనావళి. సమాజోన్నతి కాలపరిస్థితుల ననుసరించి ఉంటుంది. కాలపరిస్థితులకు అనుగుణముగా న్యాయశాస్త్రములో మార్పులు చేర్పులు జరుగకపోతే అరాచకానికి విప్లవానికి అవకాశ మేర్పడుతుంది. మానవ సంఘము ప్రాథమిక దశలో ఉండినప్పటి ఆచార వ్యవహారాలూ కట్టుబాటూ ఆధునిక సమాజములో కాలప్రభావాన్ననుసరించటము సహజము. సమాజ పురోభివృద్ధికై ఏర్పడిన న్యాయశాస్త్రము, సంఘము యొక్క ఆదర్శ, వ్యవహారాలనుబట్టి, కొన్ని మార్పులకు లోనుగావటము దేశానికి క్షేమకరము. ఈ మార్పులు వేద విరుద్ధాలయినా అంగీకరించి తీరవలసినదే. ఈ సూత్రాన్ననుసరించి 1937 లో, సంఘ సంస్కారులు కొందరు న్యాయశాస్త్రములో కొన్ని మార్పులు చేయటానికి పూనుకొన్నారు.

అంతవరకూ సమిష్టి కుటుంబములో వితంతువుకు మనోవర్తి మాత్రమే లభించేది కాని ఈ మార్పు తరువాత విభక్త కుటుంబాలలో గాని, అవిభక్త కుటుంబాలలో గాని పెనిమిటి ఆస్తికి వితంతువు హక్కుదారురా లయినది. తండ్రి, చనిపోయిన తన కుమారుని ఆస్తిని, అతని వితంతువైన తన కోడలికి, మనుమని భార్యకు (వితంతువుకు) యివ్వవలసిన వాడైనాడు. ఇది కేవలము అనుభవానికి మాత్రమే.

ఇంతవరకూ ఎన్ని మార్పులువచ్చినా ఇంట బుట్టిన కుమార్తెకు తండ్రి ఆస్తిపై అధికారము కలుగలేదు. ఆడపిల్ల పుట్టినప్పటి నుండీ వివాహమయి అత్తవారింటికి వెళ్ళే వరకూ, ఆమెను పోషించటమూ, కుటుంబ గౌరవానికి తగిన విధముగా వివాహము చేయటమూ, ఆ కుటుంబ బాధ్యత. తండ్రి చనిపోయినట్లయితే ఆడపిల్లల వివాహ కార్యాలకు తగిన ఏర్పాట్లు చేసిన తరువాతనే, కుమారులకు ఆస్తి విభాగింపబడేది కన్యకు జనకస్థానములో ఉన్న ఈ స్వల్ప అధికారాలు వివాహము కాగానే పుట్టింట తగ్గి, అత్తవారింట ఏర్పడేది. వివాహములో సప్తపాదాల చర్యతో, వధువు

వరుని అధీనురాలై పోతుంది. అతనినుండి ఆమె గౌరవాధికారాలలో మార్పులు కలుగుతాయి.

పూర్వము మూడు తరాలవరకే ఆస్తిలో వారసత్వము ఉండేది. కర్మకాండలో మూడు తరాలవరకే పిండప్రదానము జరుగుతుంది. దీని ననుసరించి కర్త కుమారుడు, కొడుకు కుమారుడు, అతడి కుమారుడు వారసులయేవారు. ఈ ముగ్గురు వారసులు లేనట్లయితే కర్త భార్యకు, తరువాత కుమార్తెకు, అటుపైన పుత్రికా పుత్రుడు వారసులయేవారు.

కర్తకు ఈ పై వారసులు ఎవరూ లేనట్లయితే అతడి తల్లికి అధికారము ఏర్పడేది. తల్లి తరువాత తండ్రికి లభించేది. తండ్రి తరువాత కర్త సోదరులకు లభించేది.

1929 ఆక్టు ప్రకారము కర్త సోదరుల తరువాత వారి కొమాళు! వారి తరువాత కర్త తండ్రి తల్లికి, ఆమె తరువాత తండ్రి తండ్రికి, వారి తరువాత కర్త కుమారుని కూతుళ్లకు, తరువాత కుమార్తె కూతుళ్ళకు, తరువాత సోదరికి వారసత్వము లభించింది. ఈ ఆక్టు ననుసరించి కర్త తాతవరకూ పైకి ప్రాకిన వారసత్వము, పైవారు లేనిపక్షములో కుమారుని కూతురికొరకు క్రిందికి దిగింది. తాతకూ తాత సహోదరులకూ మధ్యగా కొడుకు కూతురు, కూతురి కూతురు వీరిద్దరి తరువాత సోదరికి వారసత్వము లభించింది.

మన ధర్మశాస్త్రము వివాహాలను ఎనిమిది విధములుగా విభజించింది. ఈ వివాహాలన్నిటికీ ఒకేవిధమైన శాస్త్రమూ సూత్రమూ అన్వయించదు. అగ్రజాతి పురుషుడు తక్కువజాతి స్త్రీని వివాహమాడినట్లయితే ఆ వివాహాన్ని 'అనులోమ' వివాహమంటారు. దీనిని న్యాయశాస్త్రము అంగీకరించటము లేదు కనుక 'స్పెషల్ మ్యారేజి ఆక్టు' క్రింద ఈ వివాహము చేసుకొన్నట్లయితే చెల్లుతుంది.

'హిందూ లా' లో స్త్రీలకు ఆస్తిలో హక్కులు లేవు. భర్త ఆస్తిని ఆయన చనిపోయిన తరువాత కేవలము అనుభవించటానికే గాని దాన విక్రయాధికారాలు లేవు. ఎంత గొప్పయింట పుట్టినా స్త్రీకి, తండ్రి ఆస్తిలో వీసమంత భాగము లేదు. ఆర్థిక స్వాతంత్ర్యమూ, అధికారమూ లేని బ్రతుకు అధునిక కాలములో ఎందుకూ కొరగానిదై, స్త్రీని అథమస్థితికి తెచ్చింది. వైవాహిక జీవితాలలో కలిగే ఒడుదుడుకులకు నష్టము స్త్రీలే అనుభవించవలసినవా రయినారు. పుట్టింట అత్తింట ఇతరుల దయా ధర్మభిక్షముమీద స్త్రీ జీవితము ఆధారపడి ఉంటున్నది.

ఈస్థితిలో 1941 జనవరిలో భారత ప్రభుత్వము ఒక కమిటీని నిర్ణయించింది. ఆ కమిటీ మితాక్షరీయములో వితంతువుకున్న అధికారాలను, 1937 హిందూస్త్రీల ఆస్తి హక్కుల చట్టాన్ని పరిశీలించటానికీ, తండ్రి ఆస్తిలో కుమార్తెకు అధికారాలను కల్పించటానికీ నియామకమయింది. 1941 జూన్ నెలలో ఆ కమిటీ సమగ్రముగా పరిశీలించి, ఒక రిపోర్టు సిద్ధముచేసి ప్రభుత్వానికి అందించింది. దానిలో 'హిందూ లా' ను కొద్దిమార్పులతో, సంస్కరించినందువల్ల పెద్ద లాభము కలుగబోదనీ, హిందూ న్యాయశాస్త్రాన్ని సమగ్రముగా నిర్వచించి క్రోడీకరణము చేయించవలసినదనీ సలహా యిచ్చింది. దీనిని సిద్ధముచేయటానికి ప్రభుత్వము ఒక కమిటీని నియమించింది. దీనిలో డాక్టరు ద్వారకనాథమిత్ర, శ్రీ టి. ఆర్. వేంకటరామశాస్త్రి గార్లు సభ్యులుగాను, జస్టిసు బి. యన్. రావుగారు అధ్యక్షులుగాను నియామకమైనారు. ఈ కమిటీ దేశమంతా పర్యటించింది; పరిస్థితులను అవగాహన చేసుకొన్నది; లోపాలోపాలను గమనించింది. 1947 ఫిబ్రవరిలో ఒక రిపోర్టును తయారుచేసి ప్రభుత్వానికి అందించింది. హిందూ లా లో చేయవలసిన మార్పులను గురించిన చిత్తుబిల్లునుకూడా సమర్పించింది. దీనిని పర్యవేక్షించటానికి ఒక సెలక్టుకమిటీ ఏర్పడ్డది. దాని రిపోర్టుకూడా 1948 ఆగస్టులో పార్లమెంటుకు అందచేయబడ్డది. వీరందరికృషి ఫలితమే అప్పుడు చర్చకు వచ్చిన హిందూకోడ్ బిల్లులుగా రూపొందింది. మితవాదనాయకులు రాజ్యాంగసభలో దీనిని తీవ్రంగా ప్రతిఘటించారు.

ఇంతకూ దానిలో ఏమున్నదో ప్రజలకందరికీ వివరముగా తెలియదు. హిందూకోడ్ బిల్లునుగురించి తీవ్రముగా వాదోపవాదాలు జరుగుతున్నాయని మాత్రము ఆబాలగోపాలము గ్రహించారు.

హిందూకోడ్ బిల్లులో రెండవ అధ్యాయములో వివాహాలనుగురించిన సంస్కరణాలు ఉన్నాయి. వివాహపు తతంగాలు, రిజిస్ట్రేషను, సివిల్ మ్యారేజి, వాజ్యాలు, ప్రమాణాలు, సర్టిఫికెట్లను గురించి వివరించింది. మూడవ అధ్యాయములో దాంపత్యవిసర్జనము, దానికి కారణాలు, వాటిని నిరూపించవలసిన క్రమాలు, పునర్వివాహాలు, బిడ్డలవిచారణ మొదలైన అంశాలు వివరింపబడ్డాయి. నాలుగవదానిలో దత్తస్వీకారము, చట్టసమ్మతమైన దత్తత, దానికి తగిన అర్హత, అధికార నిషేధవిధానాలు, మొదలైన అంశాలు వివరించబడ్డాయి. ఆరవ అధ్యాయము సమష్టి కుటుంబ ఆస్తి ఋణములనుగురించి వివరింపబడ్డది. ఏడవది స్త్రీ ధనాన్నిగురించి, ఎనిమిదీ తొమ్మిదీ వారసత్వాధికారాలను గురించీ, పదవ అధ్యాయములో స్త్రీల ఆస్తికి వారసత్వాధికారాన్నిగురించి వ్రాయబడ్డది. మరో మూడు అధ్యాయాలు ఇతరవిషయాలను గురించి సూచింపబడ్డాయి.

హిందూకోడ్ బిల్లునుగురించి దేశంలో వాదోపవాదాలు జరిగిన తరువాత భారత ప్రభుత్వం బిలులోగల అంశాలను అన్నిటినీ విడిగా మూడు శాసనాలద్వారా ఇప్పుడు అమలు జరుపుతున్నది. వీనిలో ఆస్తి వారసత్వపు హక్కులను గురించిన శాసనాన్ని పార్లమెంటు నియమించిన సెలక్టుకమిటీ పరిశీలించి క్రిందటి పార్లమెంటు సమావేశానికి నివేదికను సమర్పించింది. ముఖ్యమైన కొన్ని మార్పులతో ఈ నివేదిక హిందూకోడ్‌లోని అభ్యుదయాశయాలను అమలు జరపడానికి అనువు కలిగిస్తుంది.

నూతన శాసనాన్ననుసరించి జన్మతః పుత్రులకు కుటుంబ ఆస్తిలో హక్కు ఉండదు. ఆస్తి హక్కుదారుడు అనగా కర్త బ్రతికి ఉన్నంతవరకూ అతడికి తప్ప మరెవరికీ హక్కు ఉండదు. ఆస్తి పిత్రార్జితమైనా, స్వార్జితమైనా, ఆ ఆస్తిని కుటుంబమందరూ కలిసి సమష్టిగా సంపాదించినా, అది చరాస్తిగానీ స్థిరాస్తిగానీ హక్కుదారుడి మరణ శాసనము (వీలునామా) ప్రకారము చెల్లుతుంది. స్త్రీలకు సంక్రమించిన ఆస్తిపైన వారికే సర్వాధికారాలూ ఉంటాయి. స్త్రీల ఆస్తికి వారసులు పట్టీ క్రమము వేరు. పురుషుల ఆస్తికి వారసుల క్రమము వేరుగా నియామకమయినారు.

వీలునామా వ్రాయకుండా చనిపోయిన కర్తయొక్క ఆస్తికి వారసులైనవారు రెండు విధాలుగా విభజింపబడ్డారు. ప్రథమ శ్రేణికి చెందినవారు కుమారుడు, వితంతువు, కుమార్తె, కర్తకంటె ముందుగా చనిపోయిన కుమారుని కుమారుడు, అతడి కుమారుడు, తండ్రికంటె ముందుగా దివంగతుడైన కుమారుని యొక్క మృతుడైన కుమారుని వితంతువు. ద్వితీయ శ్రేణిలో కర్త తల్లి, తండ్రి, కొడుకు కూతురికొడుకు కొడుకు

# ★ హిందూస్త్రీల వారసత్వాధికారము ★

కుమారుని కూతురు, కొడుకు కుమార్తె కూతురు, కర్త సోదరుడు, సోదరి క్రమముగా పరిగణింపబడ్డారు.

తరువాత సగోత్రజులు, బంధువులు లెక్కింపబడ్డారు. వీటిలో అధికారాలు ప్రత్యేకముగా విభాగింపబడ్డాయి.

ప్రథమశ్రేణిలో భార్యకు కుమారులతో సమానమైన భాగము; కుమారునికి 1 భాగమయితే, ఆమెకూ ఒకభాగము లభిస్తుంది. చనిపోయిన ప్రతికుమారుని సంతతికీ అతనిభాగము సంక్రమిస్తుంది.

మొదటి బిల్లులో స్త్రీలకు తండ్రి ఆస్తిలో సోదరునకు వచ్చినదానిలో సగముమంతు రావటమునే నిర్ణయము కేవలము స్త్రీ పురుషుల తక్కువ ఎక్కువలను నిరూపించటమే అవుతుంది. ఇది తొలగించి స్త్రీలకు పురుషులతో సమానభాగము కల్పించడానికి సెలెక్టుకమిటీ నిర్ణయించింది. ఈనివేదిక 1-వ అక్టోబరునాడు, రాజ్యసభలో చర్చకు వచ్చినప్పుడు, సభ్యులు తిరిగి వాదనకు పూనుకొన్నారు. వారికి అధ్యయము మైనస్త్రూ, శ్రీ హెచ్.వి. పటాస్కరుగారు 'కుమార్తెకు సమానభాగము వచ్చినందువల్ల, అవిభక్త కుటుంబములోని కుమారులకు నష్టముకలుగకుండా చూస్తా' మన్నారు. 'స్వార్జితమూ, పిత్రార్జితమూ అయిన ఆస్తిని తనయిష్టము వచ్చినట్లు వ్రాసియిచ్చే అధికారము తండ్రికి కలిగించటములో సభవారు బాగా ఆలోచించాలి' అని శ్రీ పటాస్కరుగారు సభ్యులను హెచ్చరించారు.

స్త్రీ పురుషులకు ఆస్తిలో సమానభాగము కల్పింపబడినట్లయితే, అవిభక్త సోదరులకంటె సోదరికి ఎక్కువ ఆస్తి దక్కుతుందనే అభిప్రాయము రాజ్యసభలో కొందరు సభ్యులకు కలిగింది. మితాక్షర న్యాయాన్ననుసరించే, సమష్టి కుటుంబ ఆస్తులకు గానీ, అటువంటి ఆస్తులలో వాటాలున్నవారికి గాని, ఈ చట్టము వర్తించదని బిల్లులో ఉన్నది. కాని – వాటిలో కూడా స్త్రీలకు భాగము యిస్తేగాని చట్టము సమగ్రముగా ఉండదని సెలక్టు కమిటీ అభిప్రాయపడ్డది. దానిపైననే సభ్యులలో కలకలము బయలుదేరి రభసగా మారింది.

స్త్రీ పురుషులు న్యాయశాస్త్ర దృష్ట్యా సమానులని భారత రాజ్యాంగము ఘోషిస్తున్నది. స్త్రీ పురుషులు సమానులని స్వాతంత్ర్యము వచ్చినప్పటినుండీ అన్ని కార్యరంగాలు నిరూపించాయి. విద్యలో, ఉద్యోగాలలో, వృత్తినర్మాలను నిర్వర్తించటములో, శక్తిలో సామర్థ్యములో యుక్తిలో, నైపుణ్యములో – ఒకటేమిటి – అన్నిటిలో సమాన ప్రతిభతో స్త్రీ పురుషులు రాణిస్తున్నారు. ప్రకృతికూడా స్త్రీ పురుషులు సమానులనేకాదు – స్త్రీలకు కొంత ఆధిక్యతనుకూడా చేకూర్చింది. ఇక స్త్రీలకు అసమ్మతి ఏ విషయములో ఉన్నది?

'నవభారతము, ప్రాచీన భారతములో స్త్రీ లనుభవించిన హక్కులను తిరిగి వారికి ప్రసాదించటానికి కృషి చేయటము అభ్యుదయ లక్షణము. ప్రాచీన హిందూధర్మశాస్త్రము సరిగా అర్థముచేసుకొని అనుసరించినట్లయితే ప్రజల అవసరాలను తీర్చగలిగినది. ఇది రూపొందించబడిన కాలములో, ప్రపంచములో ఏ దేశముకూడా సమాజములో స్త్రీ జాతికి ఇంతటి గౌరవ ప్రతిపత్తిని కల్పించలేద'ని 'ధర్మసూత్రాలలో స్త్రీలు' అను గ్రంథాన్ని ఆంగ్లభాషలో రచించి పేరుపొందిన శ్రీమతి శకుంతలారావు శాస్త్రి బలపరుస్తున్నారు.

నవభారత ప్రధాని ఆదర్శభారత భగీరథుడు. 18 సంవత్సరాలుగా ఆలోచనలో ఉన్న హిందూ న్యాయశాసనాల సంస్కరణను త్వరలో పరిష్కారము చేయగలడనీ, ఈ దశకు వచ్చిన బిల్లును మురిలిపోనీయడనీ మహిళాలోకము ఆశిస్తున్నది. ★

బాలసాహితి

# దసరా సరదా

"మల్లిక"

దసరా వచ్చిందీ—పిల్లల
దసరా వచ్చిందీ.
బొమ్మలు పెట్టీ
పేరంటాలకు
పిలిచే పండగ
మురిసే పండగ,
దసరా వచ్చిందీ—మాకూ
సరదా తెచ్చిందీ.

పట్టు పరికిణీ
కట్టి అమ్మతో
పొరుగిండ్లకు పే
రంటం పొయ్యే
ఆటల పండగ
పాటల పండగ,
దసరా వచ్చిందీ—పిల్లల
దసరా వచ్చిందీ.

గాంధీ నెహ్రూ
పటేలు బోసూ
పరమేశ్వరుడూ
గంగా, పార్వతి
లక్ష్మి విష్ణులు
యింకా యెన్నో
బొమ్మలు పెడతా,
అమ్మతో వెడతా,
దసరా వచ్చిందీ—
మాకూ
సరదా తెచ్చిందీ.

అదుగో పంతులు
వెదురు దబ్బలకు
వేవేగంగా
రంగురంగులా
కాగిత మతికీ
విల్లునంబులూ
అందం పొలికే
ట్టట్టుగ తయారు
చేస్తున్నారోయ్
వస్తున్నారోయ్.
దసరా వచ్చిందీ—
మాకూ
సరదా తెచ్చిందీ.

సాయంకాలం
ఆయుధపూజకు
కత్తులు, కటార్లు
కర్రలు, కొమ్ములు
పెట్టైనుండగా
తీశామూ, మరి
కుంకుమ పెట్టీ
పూవులు చుట్టీ

‘దయను తలచవే
శాంభవీ’ అనీ
అంబకు మ్రొక్కామూ—
జగ
దంబకు మ్రొక్కామూ.
దసరా వచ్చిందీ—పిల్లల
దసరా వచ్చిందీ.

బొమ్మలు పెట్టీ
పేరంటాలకు
పిలిచే పండగ
మురిసే పండగ
కులికే పండగ
ఆటల పండగ
పాటల పండగ
దసరా వచ్చిందీ—మాకూ
సరదా తెచ్చిందీ.



బొమ్మల పెళ్ళి

—వెల్లటూరి సీతాకుమారి.




# పికిలిపిట్ట, డేగ

చిన్న పికిలిపిట్ట చెట్టుపై కూర్చుండి
సన్న నెలుగుతోడ సన్నాయివలె పాడ,
విన్న డేగ యొకటి వెంటనే దిగివచ్చి
తన్ను కెగిరిపోయె తన కాళ్లతో పట్టి.

పాట నాపి పిట్ట ప్రార్థించె నీభంగి:
"ఏటికోయి నన్ను హింస పెట్టెద విట్లు?
సాటిపక్షినన్న జాలి కొంచెము చూపి,
గూటికడకు మరల గొంపోయి విడుమోయి!

నాకు చూడ చిన్నవలుపంత కాయమ్ము,
ఆకలైన తీరదయ్యా, నన్ను భుజింప.
నీకు పొట్ట మిగుల నిండిపోవలెనన్న
కాకి నొకటి పట్టి కమ్మగా తినవోయి!"

అంత డేగ నవ్వి ఆ చిన్నపిట్టతో
"ఎంత వెర్రిదానవే బుల్బులీ! భళీ!
చెంతనున్న పిట్ట చిన్నదే కానిమ్ము,
పొంతలేని పెద్ద పులుగుకంటెను మిన్న.

దొరకనట్టి దెంత దొడ్డదైనను గాని
దొరకినట్టిదాని దొఱగిపోదునె" యంచు
కరకు కత్తివంటి కఠిన తుండముతోడ
కొరికి కడుపు నింపుకొనిపోయె తనదారి.

ఈసప్ కథలు : 23 కుందూర్తి రామమోహనరావు



## నీతి

లభియింపని దానికొరకు
లభియించినదాని వదలు
కొనుట వట్టి వెర్రితనము
అని తెలుపును ఈ గీతము.

బాలసాహితి సీరియల్

# మార్టిన్ రాట్లర్

మూలం: ఆర్. ఎమ్. బాలన్‌టైన్

ఆరోజంతా మార్టిన్, బార్కీ అరణ్య మార్గాన నడుస్తూనే ఉన్నారు. దారిలో తాము చూసిన వివిధ వృక్షాలను, వింత పుష్పాలను, విచిత్రజంతువులనుగూర్చి ముచ్చటించుకుంటూ ముందుకు సాగిపోయారు. ఎంత దూరంపోయినా, మనుజసంచారం సూచించే ఛాయలే కానరాలేదు. సాయంత్రానికి వారికొక కాలిబాట కనిపించింది. ఆ మాత్రమైనా ఆధారం దొరికినందుకు వారికి సంతోషం కలిగింది. అక్కడ ఆగి కొన్ని పళ్లు మళ్ళీ తిన్నారు. ఆరోజున వారు ముప్ఫయిమైళ్ళు నడిచినా మనిషిజాడ లేదు. కాని అందమైనపక్షులు, భయంకరమైన జంతువులు కనిపించాయి. స్వీయరక్షణకు తుపాకులు లేవే అని విచారించారు. కాని అదృష్టవశాత్తు, వాటిని చూసి వీరెంత భయపడ్డారో, వీరిని చూసి అవీ అంతభయపడ్డాయి. అందుచేత ఏ ప్రమాదంజరగకుండానే వారు ప్రయాణంచేశారు. పాములు చాలా చోట్ల కనిపించాయి. కాని మనుషుల అలికిడీ కాగానే అవి చెట్లలోకి పారిపోయాయి. వాటిని చంపడానికి బార్కీ వెంటబడి తరిమాడుకాని ఒక్కటీ దొరకలేదు.

ఒకసారి వారికి పెద్ద పెద్ద అడవిపందుల గుంపులు ఎదురయ్యాయి. అవి మీదికి వచ్చినప్పుడు నేర్పుగా పక్కకి తొలగి తప్పించుకున్నారు. కాని అవి వెనుదిరిగి మళ్ళీ మీదికి వచ్చాయి. చెట్లపైకి ఎగబాకి, ప్రాణాలు దక్కించుకున్నారు గాని వాటికి నిష్కారణంగా బలైపోయేవారే. బ్రెజిల్ అరణ్యాలలో ఈ అడవిపందులంత భయంకరమైన జంతుజాతి మరోటి లేదు. వాటి ధైర్యశౌర్యాలు నిరుపమానం. భయమంటే ఏమిటో వాటికి తెలియదు. ఇతర జంతువులవలెకాక, తుపాకిదెబ్బలకు కూడా చలించవు. ముళ్లపందికివలె వాటిశరీరాలపై పొడుగాటి ముళ్లు ఉంటాయి.

చీకటి పడుతున్నకొద్దీ, అంతదాకా రణగొణ ధ్వనిచేసిన పక్షులు జంతువులు జోరు తగ్గించి నెమ్మదిగా వాటివాటి నివాసాలు చేరుకుంటున్నాయి. రాత్రించరాలైన ప్రాణులు నివాసాలను విడిచి బయటికి వస్తున్నాయి. గడిచిన రాత్రి బార్కీని భయపెట్టిన గబ్బిలంలాంటి దయ్యపుగబ్బిలాలు నిశ్శబ్దంగా సంచారం ప్రారంభించాయి. ఏవో కూతలు, గతరాత్రివలెనే ప్రారంభమైనాయి. హృదయభేదకమైన ఆ అరుపులు ఒక వింతజాతికిచెందిన కోతి అరుపులని తెలియగానే, మార్టిన్ తెగనవ్వాడు. కోతి అరుపులకే భయపడినందుకు బార్కీని వేళాకోళం చేశాడు. బార్కీకూడా నవ్వాడు. తనను చీకట్లో అంతభయపెట్టిన దయ్యాలు నిజంగా గబ్బిలాలు, కోతులు అని తెలియగానే గుండెమీంచి కొండంత భారంతీసేసినట్లు తేలికపడ్డాడు.

అనువాదం: నండూరి రామమోహనరావు

కాని హఠాత్తుగా ఒక గర్జన వినబడింది. మన మిత్రులు అదిరిపడ్డారు.

"ఈ ప్రాంతాల్లో సింహాలు ఉంటాయంటావా?" అని శార్కీ ఖాళీపిస్తోలుచూసి నిట్టూర్పువిడిచి, కత్తి పిడి పట్టుకుని అడిగాడు.

"ఉండవనుకుంటాను" మార్టిన్ అన్నాడు. "నేను జాగ్రఫీ పుస్తకాల్లో చదివినదాన్ని బట్టి ఈ దేశాలలో ఒకరకం పెద్దపులులు ఉంటాయనిమాత్రం..."

 మార్టిన్ రాట్లర్ 

అని అంటూ ఉండగానే అరణ్యమంతా దద్దరిల్లేట్లు గాండ్రిస్తూ దక్షిణ అమెరికన్ దేశాల్లో ఉండే ఒకజాతి పెద్దపులి మార్గమధ్యంలోకి వచ్చింది. మనబాటసారులకేసి తీక్షణంగా చూస్తూ నిలబడింది. మసక చీకటిలో పెద్దపులికళ్లు నిప్పుకణికలవలె మెరుస్తున్నాయి. భారతదేశంలోని బెంగాల్ పెద్దపులి అంత పెద్దది కాకపోయినా, పెద్దదిగానూ, భయంకరంగానూ ఉన్నది. అది అంత హఠాత్తుగా గర్జించడం, ఒక్కసారిగా ప్రత్యక్షం కావడంతో మిత్రులిద్దరూ విద్యుత్తాడితులైనట్లు నిశ్చేష్టులై నుంచున్నచోటే నుంచున్నారు. అంత పెద్ద క్రూరజంతువును చూడడం ఇద్దరికీ అదే మొదటిసారి. కొన్ని గజాలదూరంలో క్రొత్త జంతువొకటి ప్రమాదకరమైనది నుంచుంటే ఎంత ధైర్యవంతుడికైనా భయం కలగకమానదు.

మనుషులు రెప్పవాల్చకుండా కాసేపు చూస్తే ఏ జంతువూ నిలబడలేదని ఒక వాదు ఉన్నది. అరణ్యాలెక్కువగా ఉండే దేశాలలో తిరిగినవారనేకులు ఈ విషయం నిజమేనని ఋజువుచేశారు. మార్టిన్ బార్నీ పెద్దపులికేసి చాలాసేపు అలాగే నిశ్చలంగా భయంగా చూశారు. కొంతసేపట్లో పెద్దపులికి ధైర్యం సడలింది. తల కొంచెం అటూ ఇటూ తిప్పింది. వారి చూపునుండి తప్పించుకోడానికి కళ్ళుదించుకుంది. నెమ్మదిగా వెనక్కి తిరిగింది ఒక్క పెద్దగంతుతో అరణ్యంలోకి పారిపోయింది.

మార్టిన్, బార్నీ "అమ్మయ్య" అని నిట్టూర్పులు విడిచారు.

చల్లని చెమటబిందువులు తుడుచుకుంటూ "మన మీదికి రాకపోబట్టి బతికాము. వస్తే ఈ కత్తి దాని ముందు ఏ మూలకి?" అన్నాడు మార్టిన్.

"నిజమే. ఈ కత్తి దానిదేహంలోకి అంగుళమైనా దిగేదో కాదో. నన్నింతవరకూ ఏ మనిషీ, ఏ జంతువూ ఇంత భయపెట్టలేదు..." అన్నాడు బార్నీ.

ఈ సంఘటన బార్నీలో పెద్దమార్పు కలిగించింది. అవి బ్రెజిలియన్ అరణ్యాలని, దేన్నిపడితే దాన్ని అలసభావంతో చూడడానికి వీలులేదని గ్రహించాడు. వారిని ఇందాక ఎదుర్కొన్న ప్రమాదం అతురాలా యథార్థమైనదీ, భయంకరమైనదీ కావడం, వారు దాదాపు నిరాయుధులుగా ఉండడం అంత తేలిగ్గా తోసివేయదగినదిగా కనబడలేదు. అలా గంటా, రెండు గంటలసేపు బార్నీ మౌనంగా మార్టిన్ పక్కనే నడిచాడు. ఎప్పుడైనా మాట్లాడినా మునుపటివలె ఉల్లాసంగా మాట్లాడలేకపోయాడు. కాని నెమ్మది నెమ్మదిగా మళ్ళీ మామూలు మనిషై యథాప్రకారం తుళ్లుతూ, పేలుతూ కబుర్లుసాగించాడు.

వారు పగలల్లా నడిచిన అరణ్యమార్గం కొంత దూరం దట్టంగానూ, మరికొంతదూరం బంగర బయలుగానూ ఉన్నది. చెట్లగుబురులు దాటి ఇవతల పడినప్పుడల్లా వారు మెల్లిగా నడకసాగించేవారు. రంగురంగుల పక్షులను, పురుగులను చూసి ఆనందిస్తూ, పువ్వుల మధురవాసనలు ఆస్వాదిస్తూ విశ్రాంతి తీసుకునేవారు. బంగర బయలుగా ఉన్నచోట్ల తీక్షణమైన సూర్యరశ్మికి పచ్చిక మాడిపోయిఉంది. ఎండకు తాళలేక ఆ కాస్త భాగం గబగబ నడిచి చెట్లనీడ చేరుకునేవారు. బ్రెజిల్ దేశంలో కొన్నిచోట్ల వందలకొలది మైళ్ళవరకూ అలాటి మైదానపు ప్రదేశాలుంటాయి. దాని అదృష్టవశాత్తు మన ప్రయాణికులు ఉన్న ప్రాంతంలో మైదానాలు చిన్నచిన్నవి కావడంవల్ల ఆట్టే శ్రమ అనిపించలేదు.

అక్కడక్కడ చెట్లనడుమ ప్రవహిస్తున్న వాగుల చల్లని నీరు త్రాగి సేదదీర్చుకునేవారు. మధ్యాహ్నానికి అత్యంత తీవ్రంగా సూర్యుడు ప్రకాశించడంతో వారికి నిమిషనిమిషానికీ దప్పికలిగేది. ఆ ప్రవాహజలాలే లేకపోతే వారు బతికి బయటపడగలిగేవారే కాదు. ఆ వేడిలో నడవలేక ఏదైనా చెట్టునీడలో పడి నిద్రపోదామా అనికూడా వారికి అనిపించింది. ఆ సమయంలో మిగతా ప్రాణికోటికూడా చల్లని నీడపట్టుల్లో చేరి నిద్రపోతూ ఉండడంచేత, దాదాపు రెండు మూడుగంటలసేపు అరణ్యంఅంతా నిశ్శబ్దమైపోయింది. రాత్రీపగలూ అనకుండా బాధపెట్టేదోమలుకూడా ఏమైపోయాయో తెలియలేదు. ఉదయమంతా ఏ ఆకుమీద చూసినా, ఏ పువ్వుమీద చూసినా, గాలిలో ఎక్కడ చూసినా పురుగులు, చీమలు, దోమలు, ఈగలు, పక్షులు రకరకాలవి. లక్షలసంఖ్యలో రొదచేస్తూ తిరిగాయి. మధ్యాహ్నసూర్యుని తీవ్రతకు ఇవన్నీ ఎక్కడో

దాక్కున్నాయి. అరణ్యమే నిద్రపోతున్నట్టుగా తోచింది. ఆ నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ, ఏదో ఒక చిన్న పక్షిమాత్రమే అంతా నిద్రపోతుంటే, తను కాపలా కాస్తున్నట్టు కూస్తోంది. మళ్ళీ సాయంత్రం అవుతున్న కొద్దీ ఈ అనంత ప్రాణికోటి యావత్తూ మేలుకుని కొత్త ఉత్సాహంతో ఇందాక ఆపివేసిన విభిన్న శ్రుతుల ఏక సంగీతాన్ని ఆరంభించింది.

సాయంత్రానికి మన పథికులు చేరినచోటు మిట్ట పల్లాలుగా ఉంది. పోనుపోను అదంతా కొండల ప్రదేశంగా కనబడింది. ఎత్తుఎక్కడం ఆయాస మనిపించింది. ఈ రాత్రికి ప్రయాణం ఆపివేద్దామని నిశ్చయించి ఒక గుట్టఎక్కి చుట్టూ పరికించారు. దూరాన లోయలో ఎర్రని, ప్రకాశవంతమైన దీపపు వెలుగు అకస్మాత్తుగా గోచరించింది. దారి తెలియక తచ్చాడుతున్న మార్టిన్, బార్నీలకు అది ఆశాజ్యోతివలె అనిపించింది. ఆ జ్యోతికి అభిముఖులై నడిచి పోయారు.

## 9

గాఢాంధకారం అలుముకుంది. మిణుకు మిణుకుమని ప్రకాశిస్తూ, మిణుగురుపురుగులు వేలసంఖ్యలో, కనిపించాయి. చెట్లమీద, పొదలమీద కూర్చుని మెరుస్తున్నాయి. భూమికి దిగివచ్చి ఎగురుతున్న నక్షత్రాల వలె వెలుగుతున్నాయి. బార్నీ ఈ అందమైన కీటకాలను పశ్చిమ ఇండియా దీవులలో ఇదివరకు చూసి ఉన్నాడు. కాని మార్టిన్ వాటినిగూర్చి వినడమేకాని ఎప్పుడూ చూడలేదు. వాటి స్వయంప్రకాశగుణం చూసి అతని ఆశ్చర్యం చెప్పతరంకాదు.

లోయలో కనపడుతున్న దీపంవైపు పోదామని ఒకపక్క తొందరగా ఉన్నా, మార్టిన్ రాట్లర్ మిణుగురు పురుగులను పట్టుకోవాలనే సరదా పట్టలేక పోయాడు. చివరికొకదాన్ని పట్టుకుని అరచేతిలో పెట్టుకున్నాడు. చిన్నదీపంబుడ్డికంటె ఎక్కువ కాంతివంతంగాను, అందంగాను అది మెరుస్తోంది. దానికాంతి అగ్ని కాంతివలె కాక, ధగధగ మెరిసే వజ్రపుకాంతివలె నీలపు వన్నెగా ఉన్నది. పుస్తకం చదువుకోడానికి వీలైంత కాంతిని ఇస్తోంది ఆ పురుగు.

మరొక అరగంటనడిచి దీపకాంతి ఏ లోయ లోంచి వస్తోందో, ఆ లోయలోని చిన్న కుటీరం చేరుకున్నారు.

“హుష్! చప్పుడు చేయబోకు ఇందులో అటవికులెవరైనా ఉండిఉండవచ్చు.” అని బార్నీ మిత్రుణ్ణి హెచ్చరించాడు.

కుటీరానికి యాభైగజాలదూరంలో ఆగి, తెరిచి ఉన్న కిటికీగుండా చూశారు. బల్లముందు కుర్చీలో కూర్చుని ఒకవ్యక్తి చేతులమీద తల ఆన్చి దీపపు వెలుగులో ఏదో పుస్తకం చదువుకుంటున్నాడు. దూరంగా, ఉండడంవల్ల ఆకులు కొమ్మలు అడ్డంరావడంవల్ల ఆ వ్యక్తిముఖం బాగా పరిశీలనగా చూడడానికి వీలు కాలేదు. దీర్ఘకాయుడు, బలిష్ఠుడు, కొంచెం వయస్సు ముదిరినవాడు అని మాత్రం తెలుసుకోగలిగారు. బాగా వదులుగా, పొడుగ్గాఉన్న గౌను ధరించాడు. ముఖంలో ఏదో అవ్యక్త విచార రేఖతో కలిసిపోయిన తీవ్రత్వం కనిపిస్తోంది

అతడు కూర్చున్నగదిలో (ఆ కుటీరమంతా కలిపి ఆ గదిఒకటే) ఇందాక చెప్పిన కుర్చీ, బల్లతప్ప ఇంక వేరే మంచాలువగైరా సామానేమీ లేదు. ఒక మూల ఒకటిరెండు అడ్డదిడ్డాలుగా చెక్కిన ముక్కాలి పీటలుమాత్రమే ఉన్నాయి. గోడలకి చిత్ర చిత్రమైన పనిముట్లు, వేటాడితెచ్చిన జంతువులతాలూకు కొమ్ములు వగైరా బోలెడు తగిలించిఉన్నాయి. మరొక మూల పుస్తకాలకట్టలున్నాయి. వాటినిచూస్తే కొన్ని శతాబ్దాలనాటివని చెప్పకనే తెలుస్తోంది.

కుటీరాన్ని సమీపిస్తున్నకొద్దీ మన ప్రయాణీకులు అతిజాగ్రత్తగా అడుగులో అడుగు వేసుకుంటూ నడిచారు. అలా నడవడంలో బార్నీ కాలు జారి, కుటీరం చుట్టూరాఉన్న ముళ్ళకంచెలో పడ్డాడు. పెద్ద చప్పుడైంది.

కుటీరంలోని సన్యాసి (అతని వేషం చూస్తే సన్యాసివలెనే ఉన్నాడు.) ఆ ధ్వనికి ఆశ్చర్యం గాని, భయంగాని పొందలేదు. తాపీగా లేచి, గోడకి తగిలించిన తుపాకి తీసుకున్నాడు. గుమ్మంవద్దకు వెళ్ళి, తలుపు తీసి “ఎవరు వారు?” అని పోర్చుగీసు భాషలో తీవ్రంగా అడిగాడు.

“అరె. ఊరికే ఎందుకయ్యా అలా అరుస్తావు? ఇక్కడో మూల చస్తూఉంటే ఆదరించేదిపోయి అరుస్తా

వేమయ్యా?" అని శార్కీ కంచెలోంచి లేచి వళ్లు నిమురుకుంటూ మార్టిన్‌తో సహా గుమ్మందగ్గిరికి వచ్చాడు.

సన్యాసి చిరునవ్వు నవ్వుతూ వారిని లోనికి ఆహ్వానించి, వెనుకకు తిరిగాడు.

"రండి, రండి" అని కొంచెం యాసతో శుభ్రమైన ఇంగ్లీషులో వారిని ఆహ్వానించాడు. "నాకు చాలా ఆనందంగా ఉంది. మీరు ఇంగ్లీషువాళ్లుకదూ. మీభాష నాకు బాగా తెలుసు. చాలాకాలం క్రితం నేను ఇంగ్లీషువాళ్ళ మధ్య ఉండేవాణ్ణి. అబ్బో, చాల కాలం కింద. ఈమధ్య ఇంగ్లీషువాళ్ళని చూడడం ఇదే మొదటిసారి."

ఇలా మాట్లాడుతూ సన్యాసి అతిథు లిద్దరినీ బల్లముందు కూర్చోబెట్టాడు. పండిన పళ్లు, ఎండబెట్టిన పళ్లు, కొన్ని కేకులు, ఒక తేనె సీసా, మరొక రాతి సీసాలో మంచినీళ్లు బల్లమీద అమర్చాడు. మార్టిన్, శార్కీ ఆకలిగొన్న సింహాలవలె ఈ పదార్థాలను అన్నివైపులనుండీ ముట్టడించివేశారు.

అది చూసి ఆనందిస్తూ సన్యాసి వారిని 'ఎక్కడి నుంచి వచ్చారు, ఎవరు మీరు' వగైరా ప్రశ్నలడిగాడు.

"మేము సముద్రంలోంచి వచ్చాము" అని పరధ్యానంగా అనేసి శార్కీ చక్కని పైనాపిల్ పండును కొరికి ధ్వంసంచేస్తూ "ఏమండీ, మీ పేరేమిటన్నారు? ఆహాహా! దివ్యమైన భోజనం! అందులో ఆకలిగా ఉన్నవాళ్ళకి, ఆహాహా! ఓహోహో!" అని ఆడిపోయాడు.

మార్టిన్ మర్యాదగా ఇలా అన్నాడు: "జరిగింది ఇదండీ; మా నౌకను సముద్రపు దొంగలు పట్టుకున్నారు. మేమిద్దరం ఒడ్డుకి ఈదుకు వచ్చాము. అడవుల్లో దారీ, తెన్నూ తెలియక తిరుగుతూ మీకుటీరంలోకి అదృష్టంకొద్దీ వచ్చిపడ్డాము."

"అవునవును. నిజంగా మన అదృష్టమే" అని శార్కీ పైనాపిల్ ముక్కను అమాంతంగా కొరికి ఆఖరు చేసేశాడు.

భోజనానంతరం మాట్లాడుతూ ఖద్యోతనౌకను దొంగలు ఎలా పట్టుకున్నదీ, తాము ఎలా తప్పించుకున్నదీ, అడవిలో తాము ఏ కష్టాలు పడిందీ అన్నీ వివరంగా శార్కీ వర్ణించాడు. సన్యాసి నిశ్శబ్దంగా కూర్చుని జాగ్రత్తగా విన్నాడు. చివరి కిలా అన్నాడు: "అనతికాలంలోనే మీరు అనేకం చూశారు. బహుశా ఇంకా ఎంతో చూస్తారు. మీరు బాగా అలిసిపోయి నట్లున్నారు. ఇక విశ్రాంతి తీసుకోండి. నేను రేపు మాట్లాడతాను."

శార్కీ మట్టినేలవంక చూసి పెదవులు విరిచి "అయితే మేము పడుకునేందుకు జాగా ఉందాండి" అని అడిగాడు.

సమాధానమివ్వకుండా సన్యాసి ఒక మూలకు వెళ్ళి కుప్పగా పడిఉన్న రెండు ఉయ్యాలలు ఇవతలకు ఈడ్చుకొచ్చాడు. వలలమాదిరిగా అల్లిన పొడుగాటి ఉయ్యాలలను ఆ గోడకి ఒక కొన, ఈ గోడకి ఒక కొన కట్టి వేలాడదీశాడు. వాటిమీద దుప్పట్లు పరిచాడు. అతిథులకేసి తిరిగి "ఇవిగో మీకు పక్కలు. పడుకోండి," అని నవ్వుతూ అన్నాడు.

వెంటనే బల్లవద్దకు పోయి తన కుర్చీలో కూర్చుని ఇందాకటి పెద్ద పుస్తకాన్ని తెరిచి తిరిగి చదువులో మునిగిపోయాడు. అతని వైఖరిని ఆశ్చర్యంగా మార్టిన్, శార్కీ అయిదు నిమిషాలసేపు అలాగే చూశారు. తరవాత తమలోతాము నవ్వుకుని ఉయ్యాలలెక్కి, కొన్ని క్షణాలలో గాఢంగా నిద్రపోయారు.

(ఇంకా ఉంది)

<u>సంగీత నాటిక</u>

# పాప - చంద్రుడు

## కవిరావు

[తల్లి, పాపను చంక నెత్తుకొని చంద్రుణ్ణి చూపించుతూ...]

తల్లి:

"చందమామ! రావె
జాబిల్లి! రావె
కొండెక్కి రావె
గోగుపువ్వు తేవె"...

పాప:

దిగిరాడేమే దిగిరాడేం
చంద్రుడు క్రిందికి దిగిరాడేం?

తల్లి:

ఎన్నటికి దిగిరాడు
పున్నమీ చందురుడు,
పెద్దకథ జరిగింది
పూర్వకాలమునందు;

పాప:

ఏమాకథ నా కెరిగించు
చందురు డెందుకు దిగిరాడో?

తల్లి:

దినదినము చంద్రుండు
దివినుండి దిగివచ్చి
బాలతో ఆడుకొని
పైకి పోయెడివాడు;
చాలకాలమిట్లై
సాగె వారల చెలిమి.

పాప:

తరువాతమ్మా!
తరువాత?

తల్లి:

వచ్చె వానంతమ్ము
విచ్చె కుసుమావళులు,
ఆనందమున బాల
ఆడుకొనుచుండగా—

పూల బాలలు:

బాలా! బాలా!!
పరుగున రావా?
హాయి హాయిగా
ఆటలాడుదము.

బాల:

ఎవరు మీరు ఎవరు మీరు?
ఎరుగ నసలు మిమ్ము నేను.
అందమైన చందమామ
ఆటలాడవచ్చు నిపుడు
నేను రాను నేను రాను
రాను రాను పొండి పొండి!
ఎవరు మీరు ఎవరు మీరు?
ఎరుగ నసలు మిమ్ము నేను.

పూలు:

తీగలపైనా - తీరిగ్గా మరి
తూగుటుయ్యాలల
నూగుచుండెదము;
గాలి బాలలకు
గంధం పూయుచు,
తుమ్మెద మీటెడి
తుంబుర రొదలో
హాయిహాయిగా
ఆటలాడుదుము,
మమ్మెరుంగవా?
మమ్మెరుంగవా!



# పాప - చంద్రుడు

బాల:

కమ్మకమ్మ వాసనలను
చిమ్మరించుచున్న మీరు
మంచివారలంచు నాదు
మనసులోన తోచుచుండె;
పేరు మాటలాడక మీ
పేరులేమొ చెప్పరాదె?
ఎవరు మీరు ఎవరు మీకు?
ఎరుగ నసలు మిమ్ము నేను.

పూలు:

వసంతకాలము
వచ్చినతోడనె
పసందు వాసన
లోనంగుచుండెడి
పూల బాలలము!
పూల బాలలము!!

బాల:

చాల సంతసమ్ము నాకు
పూలబాల లన్న యెడల,
అమ్మ చెప్పె మిమ్ముగూర్చి
ఆటలాడ వత్తు మీతో.

పూలు:

గులాబిరాణులు-చలాకి మల్లెలు
మందారాలూ-మంకెన పూలూ
సన్నజాజులూ-సంపెగ బాలలు
అందరు రండీ! అందరు రండీ!!
నేడిక బాలతో నేస్తం కలిసెను,
అందరు రండీ! ఆడుకొంద మిక.

చందమామ:

ఓ బాల! ఓ బాల!!
నే చందమామనే
తోడుగా నీతోడ
ఆడుకొన వచ్చాను
ఓ బాల! ఓ బాల!
నే చందమామనే

బాల:

పూలబాల లుండె నాకు
చాలు నీదు స్నేహమింక
నేను రాను నేను రాను
చందమామ! పో పో!

చందమామ:

పసిడి గిన్నెలో వేడి
పాయసాన్నము దెస్తి
ఆరగింతువు రావె,
అమృతంబు దెచ్చితిని.
జాజిపో నే బాల
పళ్లమూలాలు పోక,
ఓ బాల! ఓ బాల!
నే చందమామనే

బాల:

ఒట్టి ఆకలేల నాకు
పెట్టకోయి చందమామ!
పూలలోని తేనె త్రాగి
సోలిపోదు నింక నేను,
అమృతంబు వద్దు నాకు
ఆటలాడ రాను నీతో
పూలబాలలుండె నాకు
చాలు నీదు స్నేహమింక.

చందమామ:

మించిపోగా విచా
రించుకొందువె బాల!
నిజము నిలకడమీద
నీకె తెలియును లెమ్ము;
లేదు పొత్తిక మనకు
లేదింక లేదింక;
నీదారి నీదె పో
నాదారి నా దింక.

* * *

పాప:

పాపం! తర్వా తేమాయె?

తల్లి:

పూలబాలలతో డ
బాల నేస్తము చేయ
చంద్రుడిక రానంచు
శపథంబు చేశాడు—
కాని మొకరీతిగా
గడచునటె నా తల్లి?

పాప:

బాలకు పూలకు
పడలేదా?
చెప్పమ్మా! మరి
చెప్పమ్మా?

తల్లి:

కొంత కాలమ్ముపై
గంతులేయును బాల
వేడుకతో కాలంబు
వెళ్ళబుచ్చెను దపుడు

పాప:

ఆఁ ఆఁ తర్వాత్తర్వాత?

తల్లి:

వానకాలంబు ముదిరి
వెంట గ్రీష్మము వచ్చె,
ఎండ వేడికి చెట్లు
ఎండిపోసాగినవి;
పూలబాలలు రాలి
నేలపాలైపోవ
తీరె మన బాలకిక
వారితో నేస్తాలు.

పాప:

రెంటికి చెడిన రేవడికా
చివరకు బాల చెడిపోయె.
పాపం! చంద్రుని ప్రార్థిస్తే
ఫలితం ఉండేదేమోగా?

తల్లి:

పాప మిక మన బాల
పరుగు పరుగున వచ్చి
జాలిగా చంద్రుణ్ణి
ప్రార్థింపసాగింది.

* * *

# 18. కుళ్లుమోతు పళ్లు

గ్రీకు కవయిత్రి శాఫో ఒక విషాదగీతంలో వ్రాసినట్లు, మూడే మూడు ఎర్రని, పక్వమైన, అందరి చేతా విస్మరించబడిన ఆపిల్ పళ్లు ఒక చెట్టుమీద మిగిలాయి.

ఉన్నట్లుండి విసురుగా వీచిన గాలి వేగానికి మూడుపళ్లూ రాలిపోయాయి. ఖర్మంచాలక అవి ఒకే చోట పడ్డాయి. ఒకదాన్నొకటి తోసుకోడం, తన్నుకోడం, తిట్టుకోడం, కొట్టుకోడం సాగించాయి. దాన్ని ఇదీ, దీన్ని అదీ నెట్టుకుంటూ నెట్టుకుంటూ, చివరి కొక పిట్టదగ్గిరికి వెళ్లి తీర్పు చెప్పమని అడిగాయి.

"నే నెలా తీర్పు చెబుతానూ? మీరు ముగ్గురూ ఒకచోటి కెలా వచ్చారో, మీరు దేనికోసం దెబ్బలాడుతున్నారో నాకేం తెలుసు? నాకు తెలిసిందల్లా మీరు కుళ్లిపోయిన కుళ్లుమోతు పళ్ళనీ, మీరు తగవులాడినకొద్దీ కుళ్లిపోతారనీ. పొండి, పొండి, తీర్పు చెప్పాలట, తీర్పు!" అని పిట్ట ఎగిరిపోయింది.

# 19. కోడి, జెర్రి

నేలమీద పాకుతున్న చిన్న జెర్రిని చూసిం దొక కోడి. వెంటనే రెక్కలార్చి, వళ్లు విదిర్చి, శౌర్య ధైర్యాలన్నిటినీ కూడగట్టుకుని జెర్రిమీదికి దండెత్తిపోయి, కబళించడానికి ఆయత్తమైంది.

ఆ ప్రక్కనే తిరుగాడుతున్న బాతు కోడిని, దాని సన్నాహాన్ని, యుద్ధానికి పోతున్నట్లు చేస్తున్న ఆ హంగామాని చూసి నవ్వుకుని వ్యంగ్యంగా ఇలా అంది:

"కొండలన్ని కొట్టి పిండి
చేసెదు భంగి
చేసినావు హంగు జెర్రి
కొరకు!"

కోడి ఇలా సమాధానమిచ్చింది:

"శత్రువన్న పిదప శత్రువే
యగు గాదె,
ఎంత అల్పమైన జంతువైన"



బాల:

చందమామ! రావె
జాబిల్లి! రావె
నేను నీ బాలనే
నేస్తాని కొచ్చాను,
దిగిరావె దిగిరావె
దివినుండి భువికి
చందమామ! రావె
జాబిల్లి! రావె

చందమామ:

నేల కెప్పుడు రాను
బాల నీ నేస్త మిక,
చాలు చాలును పోవె
చాలు నీ మర్యాద

బాల:

పూం నమ్మి మోసపోతి
చాలు నాకు సిగ్గు వచ్చె
చందమామ! రావె
జాబిల్లి! రావె
కొండెక్కి రావె
గోగుపువ్వు తేవె

చందమామ:

రాను పోపో బాల
రానంటె రానింక,
మింట చుక్కలు నాకు
జంటగా నుండెదరు;
ఆకాశవీధిలో
ఆడుకొంటా నింక
దిగిరాను దిగిరాను
దివినుండి మీ భువికి
రాను పోపో బాల
రానంటె రానింక.



పాప:

రానే రాలేదా అమ్మా!
బాల ప్రార్థనమె వినలేదా?

తల్లి:

చందమామా! రావె
జాబిల్లి! రమ్మంచు
ఎన్ని రోజులో బాల
యేడ్చింది యేడ్చింది;
బాంపై చంద్రునికి
జాలి కల్గనె లేదు.
ఎంతో కాలమునుండి
యింతవర కట్టులే
పిల్లలందరు తనను
పిలుచుచుండిన గాని
చుక్కలతో పైనుండి
చూచి నవ్వుచునుండు;
పాపలంటే పంచ
ప్రాణమ్ము లాతనికి
కాని యీభువి కింక
తాను దిగిరాడమ్మ.



# తలలు విరిగిన బొమ్మలు

**గోటూర్ భవానీశంకర్**

[బొమ్మల కొలువుకోసం అలంకరించబడిన గది. ఆ గదిలో బల్లమీద మూడు తలలు విరిగిన బొమ్మలు; ఆ బొమ్మలముందు రాధ విచారంగా నిలుచునుంది.]

తల్లి: (ప్రవేశించి) ఏం రాధా అలా నిలుచున్నావ్? లోపలకి రా, పూలు కట్టుదువు గాని.

రాధ: ఏం లేదమ్మా. యీ మూడు బొమ్మలు చూశావ్?

తల్లి: చూశాను. వాటి తలలు విరిగిపోయాయిగా.

రా: నా ముగ్గురు స్నేహితురాళ్లు నా కెంతో ఆప్యాయంగా ఈ బొమ్మలు బహూకరించారు.



కానీ నాదురదృష్టం మూటికీ తలలు విరిగిపోయాయ్.

త: పోతే పోయాయిలే! ఆ బొమ్మలు లేకపోతే వేరే బొమ్మలు కావలసినన్ని వున్నాయిగా!

రా: అది కాదమ్మా; తమ జ్ఞాపకార్థకంగా యివి యిచ్చారమ్మా. దసరా సెలవుల్లో వస్తాం, మేమిచ్చిన బొమ్మలను బాగా సింగారించి కొలువులో వుంచు అన్నారు.

త: పోనీ, అలాంటి బొమ్మలు బజారులో వున్నాయేమో చూడు.

రా: చూశానమ్మా ఎక్కడా లేవు.

త: పోనీలే. విరిగిపోయినందుకు ఎవరు ఏం చేయగలుగుతారు. విరిగిన ముక్కలు యిలా యివ్వు అతికించి యిస్తాను. నా నేర్పుకూడా చూద్దువు గాని.

రా: అదయినా కాస్త చేసియ్యవే!

[అంతలో మాలతి, లలిత ప్రవేశిస్తారు]

లలిత, మాలతి: రాధా! రాధా!!

రా: రండి! రండి! ఎప్పుడొచ్చారు?

ల: ఇప్పుడే!

రా: సుమతి వచ్చేసిందా?

మా: ఓ...వచ్చేసింది. అందరం ఒకే బస్సులో వచ్చాం. దానికి యిల్లు వాకిలి మీద అక్కర ఎక్కువ. మాలాగా అది స్నేహితులచుట్టూ తిరుగుతూ వుండదు.

మా: అదేం రాధా! ఒకమాదిరిగా వున్నావ్?

రా: ఏంలేదు మాలతీ!

ల: అబ్బ; చెప్పవే. మాకు చెప్పకూడదా ఏం?

రా: ఏమీలేదే అంటే మీరు వినరే.

త: ఏమీలేదు. నీవు, మాలతి, సుమతి మూడుబొమ్మలు యిచ్చారట. వాటికి తలలువిరిగిపోయాయి. వాటిని నే నతికించి యిస్తానని చెప్పాను, అయినా అది బాధపడుతూవుంది.

మా: ఇందుకే దుఃఖిస్తున్నావా రాధా! వాటి తలలు నే నతికించి యిస్తా ఆ బొమ్మల తలలు యిలా యివ్వు.

(రాధ తిన్నగా లేచి ఒక పెట్టెలోనుండి మూడుబొమ్మ తలలు తీసి మాలతి చేతికి యిచ్చింది)

మా: (ఒకబొమ్మతలతీసి) ఇది చూశావా? ఎంత ఘోరంగావుందో. ఇది నీ బొమ్మదేకదూ లలితా?

ల: ఛీ! నా బొమ్మతల అదెందుకవుతుంది.

మా: అయితే సుమతి బొమ్మతలేవుంటుంది. (మరోతలతీసి) లలితా కాస్త మెల్లకన్నుగావున్న నీబొమ్మతల నా బొమ్మతలకు ఏమాత్రం తీసిపోదు.

ల: ఆహాఁ! అయితే మెల్లకన్నుతల నా బొమ్మకు అతికిస్తావా? ఆ మూడుతలల్లో బాగున్నతలే నా

బొమ్మది. నేనే తలలు అతికిస్తే నే ఒప్పుకోను.

మా: అయితే నా బొమ్మతల నాకే తెలియదంటావా?

ల: తెలుసుంటే ఆ మెల్లకన్ను తల నీ బొమ్మ కతికించుకోరాదూ?

మా: అయితే, ఈ సొట్టముక్కు తల నీ బొమ్మకు అతికించమంటావా?

రా: అయితే అందంగా వున్న తల సుమతిదే అయివుంటుంది.

ల: కాదుకాదు దానిది సొట్ట ముక్కు బొమ్మ.

మా: కాదు కాదు దానిని మెల్ల కన్ను బొమ్మ.

రా: మీరు కొన్నప్పుడు బొమ్మలనుచూసి కొనలేదా?

మా: చూసే కొన్నాం. అన్నీ ఒకేరకం బొమ్మలుకొన్నాం. అవి ధరించిన దుస్తులరంగుల్లోనే తేడా.

రా: అదిగో! మన సుమతి వస్తూంది. దాన్ని అడుగుదాం.

(సుమతి వస్తుంది)

రా: ఏమే సుమతి యింత ఆలస్యంగా వచ్చావు?

సుమతి: ఊరినుంచి వచ్చాను కదా, అవీ యివీ మాట్లాడుతూంటే ఆలస్యమయింది.

రా: మరి, మాలతి, లలిత, నీవు నాకు మూడు బొమ్మలు యిచ్చారు కదూ! వాటికి తలలు వూడిపోయాయి. ఏ బొమ్మది ఏ తలో తెలియకపోయింది. ఇప్పుడు వాటి నెలా అతికించమంటావు?

సు: ఏదో ఒకదానికి ఏదో ఒక తల అతికించండి. మూడు ఒకలాగే వున్నాయిగా.

రా: కాదు. ఒక తలకు మెల్ల కన్ను; మరొక తలకు సొట్ట ముక్కు; మూడో తల మాత్రం అందంగా ముద్దుగా వుంది. ఏ తల నీ బొమ్మదో చెప్పు చూద్దాం.

సు: అలాగా! కొన్నప్పుడు ఆ భేదాలు వున్నట్టు నాకు జ్ఞాపకం లేదు. ఆ బొమ్మల తలలు యిలా యివ్వు చూద్దాం.

రా: (సుమతికి బొమ్మల తలలు యిస్తూ) ఇందులో నీ బొమ్మది ఏ తలే, చూపించు.

సు: ఇందులో నిజంగా ఒక తలే అందంగా వుంది. కాని ఆ తల నా బొమ్మదేనని నే నెలా చెప్పగలను?

మా: చూశావా!, ఆ తల సుమతి బొమ్మది కానప్పుడు మరి నా బొమ్మదే అయివుండాలికద రాధా?

ల: అది నా బొమ్మది మాత్రం ఎందుకు కాకూడదూ?

సు: నా బొమ్మది కాదు అని నేను ఖచ్చితంగా చెప్పలేదే! ఏ బొమ్మదో చెప్పడం కష్టంగా వుంది అన్నాను.

ల: దానికి కాస్త తెలివిమందం గాని, రాధా! ఆ ముద్దుల తల నా బొమ్మదే.

మా: దాని మొఖం చూడు. నా బొమ్మదే రాధా ఆ తల.

రా: అబ్బబ్బా! ఆగండి! ఈ విషయం మిమ్మల్ని అడుగుతే తెలియదు గాని; ఆ బొమ్మలనే అడుగుతాను.

మా: ఆ బొమ్మలతో ఎలా మాట్లాడుతావే?

ల: అవి నీకు జవాబు లిస్తాయా?

సు: అవి మాట్లాడేట్టయితే, ఈ చిక్కు సులభంగా తీరిపోతుంది.

రా: నేను బొమ్మల నడిగి కనుక్కుంటా. రేపు తెల్లవారి రండి.

(సుమతి, మాలతి, లలితా నిష్క్రమణ)

## 2

(స్థలం అదే.
కాలం - మరునాటి ఉదయం)

త: ఏమే రాధా! ఆ బొమ్మలకు తల లతికించావా?

రా: రాత్రంతా యోజించాను; ఏ బొమ్మకు ఏ తల అతికించుదామా అని.

త: అతికించావా?

రా: ఆఁ అతికించానమ్మా.

త: ఏవీ యిలా తీసుకరా చూద్దాం.

రా: ఇప్పుడు కాదు. వాళ్లు ముగ్గురూ రావాలి, ఆ బొమ్మలను చూడాలి. అంతకుముందు బ్రహ్మదేవుడువచ్చి అడిగినా చూపను.

త: అదిగో వాళ్ళు వచ్చేటట్టు వుంది.

రా: అయితే నీవు ఆ ప్రక్కగదిలోకి వెళ్ళి మా తమాషా అంతా చూస్తూవుండమ్మా.

త: అలాగే లే అమ్మా; (వెళ్ళిపోతుంది)

(ప్రవేశం-లలిత; సుమతి)

రా: రండి! రండి! మరి మాలతి రాలేదేం?

(మాలతి తొందర తొందరగా వచ్చి)

మా: రాధా! రాధా! ఏవీ?... బొమ్మలేవీ?

రా: ఏమే అంత గబగబ వచ్చావు?

మా: వీళ్ళిద్దరూ మీ యింటికి రావటం చూశాను; నాకన్న ముందు ఆ బొమ్మలను చూసేస్తారేమోనని పరుగెత్తుకుంటూ వచ్చాను.

# ★ తలలు విరిగిన బొమ్మలు ★

రా: సేద దీర్చుకో! ఇంకా ఎవరూ బొమ్మలు చూడలేదు లే.

సు: బొమ్మలకు తలలంటించావా?

రా: కాస్త ఆగండే! తొందరపోతూ ఊహలల్లకటం ఎందుకూ?

ల: అబ్బా ఎంత ఆశ పుట్టిస్తావే!

మా: అట్టే చంపక చెప్పవే.

ల: నీకు కోటి దండాలే, ఆ బొమ్మలు చూపించవే!

రా: నా వెనుక రాకుండా, యిక్కడే వుండండి ఒకొక్క బొమ్మె తెస్తా.

(అని లోనికి వెళ్ళి ఒక బొమ్మ తెచ్చింది)

రా: ఈ పచ్చపావడా బొమ్మ ఎవరిది?

మా: అదేమిటి? తలకాయ అతికించలేదు అది నా బొమ్మ!

రా: ఇది నీదగ్గరే వుంచు; మరో బొమ్మ తెస్తా.

(వెళ్ళిపోయింది)

ల: ఇంకా తల లంటించలేదేమిటే సుమతీ. రాధ ఏదో పెద్ద ఎత్తు వేసినట్టువుందే.

రా: (రెండు చేతులలో రెండు బొమ్మలు తెస్తుంది) ఇవి ఎవరెవరివో చెప్పండి?

ల: ఆ నీలి పావడా బొమ్మ నాదే!

సు: ఆ తెల్ల పావడా బొమ్మ నాదే!

మా: అదేమిటి ఒక్క దానికయినా తల లంటించలేదు.

ల: పోనీ ఆ బొమ్మలతో మాట్లాడావా?

మా: నీ పిచ్చి గాని బొమ్మలు మాట్లాడుతాయా?

సు: ఆగండి! రాధ ఏం చెబుతుందో చూద్దాం.

రా: మీరు వెళ్ళిపోయిన తరువాత, ఆ మూడు తలలను "మీరు ఏఏ బొమ్మల తలలూ" అని అడిగాను. అవి దానికి జవాబు చెప్పడానికి బదులు పెద్ద ఉపన్యాసమే ప్రారంభించాయి.

ల: మట్టి తలలు!

మా: ఉపన్యాసమా?

రా: మొదట సొట్టముక్కు బొమ్మ చెప్పిందికదా; "మరి నాకు సొట్టముక్కు వుందని మాలతి ఎగతాళి చేయక మానదు; కాబట్టి దాని బొమ్మకూ కాస్తా ముక్కు సొట్ట చేసేయ్" అన్నది.

మా: (ఆత్రంగా) అందుకు మెల్లకన్ను బొమ్మ ఏమన్నదేమిటి?

రా: "నాకు మెల్లకన్ను వుందని లలిత వేళాకోళం చేయకుండా మానదు, కనుక దాని బొమ్మకు కాస్తా మెల్లకన్ను చేసేయ్" అన్నది.

ల: ఆ—ముందే సొట్టముక్కు,

అందులో మెల్లకన్నయితే ఎలా వుంటుంది...అబ్బ. చాలా ఘోరంగా వుంటుంది. పోనీ అందుకు సొట్టముక్కుబొమ్మ ఏమనింది?(బాధతో)

రా: సొట్టముక్కు బొమ్మ ఏం చెప్పిందనికదూ నీవడగటం? "వాళ్లిద్దరూ మమ్మల్ని ఎగతాళిచెయ్యక పోతే చాలు. మేము ఒకరినొకరు వెక్కిరించుకోము. మనుష్యుల్లో వున్న ఆ హేళనచేసే దురభ్యాసం మాకులేదు" అన్నది.

సు: ఎంత తెలివిగా మాట్లాడింది రాధా ఆ బొమ్మ!

మా: } (ఇద్దరూ విచారంగా
ల: }

నిలుచునుంటారు)

సు: రాధా! సొట్టముక్కు బొమ్మకు మెల్లకన్నూ, మెల్లకన్ను బొమ్మకు సొట్టముక్కూ చేయడం కన్నా, రెండిటినీ అందంగా తీర్చే యత్నం చెయ్యకూడదూ?

రా: ఆ విషయమే చెప్ప వచ్చాను. అప్పుడు ముద్దులతల ముందుకువచ్చి "మీరు ఒకరంటారని వికారాలు చేసుకోవడం దేనికి. ముగ్గురం అందంగావుండడానికి ప్రయత్నించకూడదా?బుద్ధి అన్నిటికయినా ముఖ్యమయినది. అది సొట్టయితే అందరూ అసహ్యించుకుంటారని తెలుసుకోండి. ఎవరికోసమో మనం రూపాలు మార్చుకోడం దేనికి"అన్నది.

సు: ఆ రెండుతలలకూ అందాలు కూర్చావా?

రా: ఆ ముద్దులతల ఆమాటలు చెప్పేసరికి మేము ఎప్పటిలాగే వుంటాము. మాకేం అందం అక్కరలేదు. తెలియకుండా వాళ్ళకోసం ఆవేశపడి మేము మరింత వికారమవడానికి సిద్ధమయ్యాము" అన్నాయి.

ల: పోనీలే! సొట్టముక్కు తలకు మెల్లకన్నూ...

మా: మెల్లకన్ను బొమ్మకు సొట్టముక్కూ చేసేయలేదుకదా? (నిట్టూర్పు విడిచింది)

రా: ఉండండి! నేనేంచేశానో చూపుతా.

(లోపలికి వెళ్ళింది)

ల: }
మా: } (వింతగా ఆ వైపే చూస్తూవుంటారు)
సు: }

రా: (ప్రవేశించి) చూశారా?

ల: అదేమిటి దేనికీ సొట్టముక్కే లేదు.

మా: ఏ బొమ్మకూ మెల్లకన్ను లేదు.

సు: మూడుతలలూ ముద్దుగా వున్నాయే!

ల: మంచిపని చేశావే రాధా.

రా: ఇప్పుడు మూడుతలలూ ముద్దుగొలుపుతూ వున్నాయికదూ!

మా: అవునే.

రా: మా నాన్నకు నిన్న ఈ సంగతి చెప్పాను. ఆయన నేర్పుగా యీ మూడు తలలూ తీర్చి యిచ్చారు. వీటిని మీరు తీసుకపోయి, తల లతికించి, గేపు తెచ్చి యివ్వండి. వెళ్ళిరండి!

(లలిత; మాలతి; సుమతి; వెళ్ల బోతూంటే—)

రా: మాలతీ! ఇలారా! ఏమీ అనుకోవద్దు నీ బొమ్మది మెల్ల కన్నుతలకదూ!

మా: ఔను. ఇకనుంచి ఎవరినీ వెక్కిరించను లేవే.

రా: మరి; లలితా!

ల: అడగడమెందుకులేవే బుద్ధిలేక సొట్టముక్కుబొమ్మ నాది కాదన్నాను. ఇప్పుడు బుద్ధివచ్చింది.

సు: రాధా! నీకెలా తెలుసుకున్నావే యిదంతా. నిజంగా ఆ బొమ్మలు మాట్లాడాయా.

రా: ఇదేం బ్రహ్మవిద్యా? వాళ్ళ మాటలుబట్టి గ్రహించాను. ఆబొమ్మలు నాతో మాట్లాడలేదు. నిజంగా ఏ బొమ్మది ఏ తలో నిర్ణయించడానికి మా నాన్న ఇదంతా కల్పించి చెప్పారు. అది మనం ప్రయోగంచేసి చూశాం. ఫలించింది.

సు: మీ నాన్న కల్పనకు నీవు ప్రాణంపోసి, గొప్పచిక్కు తీర్చావు!

మా: వెడతాం. మంచి గుణపాఠం నేర్చుకున్నాం. నమస్తే!

రా: నమస్తే! వెళ్ళిరండి.

(రాధ నిలుచునుండగా అందరూ వెళ్లుతారు.) ★



విక్రమ్ ప్రొడక్షన్స్‌వారి "తెనాలి రామకృష్ణ"లో మహాకవి అల్లరికి ఆశ్చర్యపోతున్న కమల.

# "ఝనక్ ఝనక్ పాయల్ బాజే"

కేవలం చలనచిత్ర శిల్పాన్ని దృష్టిలో పెట్టుకుని చూస్తే, వి. శాంతారాం నిర్మించిన "ఝనక్ ఝనక్ పాయల్ బాజే" మన చలనచిత్ర చరిత్రలో ఒక క్రొత్తఅధ్యాయాన్ని ప్రారంభించిన దనవచ్చును. బొంబాయి చిత్రపరిశ్రమ ఇటీవలి కాలంలో శిల్పానికి సంబంధించినంత వరకూ చిత్రవిచిత్రమైన ప్రయోగాలుచేస్తూ, మిగతా కేంద్రాలకంటె ఎంతో పురోగమించింది. ఈ ప్రయోగాలన్నిటికీ మకుటాయమానంగా ఉంటూ, నిర్మాణంలోనూ, శిల్పంలోనూ ఏ భారతీయ చిత్రమూ సాధించని అపూర్వ విజయం సాధించిన చిత్రాన్ని శాంతారాం నిర్మించారు. భాకీ ఎస్తున భారతదేశంలో నిర్మింపబడిన టెక్నికలర్ చిత్రాలలో ఇది మొదటిదే అయినా, ప్రమాణప్రాయంగా ఉండతగ్గాయని ఈ చిత్రం అనుకున్నది.

"ఝనక్ ఝనక్..." చిత్రంలో టెక్నికలర్‌లోని సౌందర్యమంతా కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. ఛాయాగ్రహణం నిర్వహించిన బాలకృష్ణ చాలా ప్రశంసనీయమైన ఫలితాలు సాధించారు. భారతదేశపు ప్రకృతి రామణీయకాన్ని, వివిధవర్ణాల పుష్పాలను, వృక్షాలను, నదులను, మారే ఋతువులను సౌందర్యం ఉట్టిపడే కవితాత్మక పద్ధతిలో చిత్రించారు. కొన్నికొన్ని భాగాలలో, ముఖ్యంగా విశ్రాంతి సమయం దాకా ఈ చిత్రం ఏదో స్వప్నలోకంలోకి తీసుకుపోతుంది. మైసూర్‌లోని బృందావన ఉద్యాన దృశ్యాలు, తదితర బహిరంగ స్థల దృశ్యాలు అపూర్వంగా ఉన్నాయి. వీటితో సరిసమానమైన సౌందర్యం కలిగిన భవనాంతర్భాగదృశ్యాలు నిర్మించడానికి కళాదర్శకుడు కనూదేశాయ్ తన కళాసంపత్తినంతా వినియోగించారు. భవనాంతర్భాగాలలోని ప్రతిదృశ్యమూ, దృశ్యంలోని ప్రతివస్తువూ ఎంతో మనోజ్ఞమైన కళానైపుణ్యాన్ని ప్రదర్శిస్తుంది.

తరువాత చెప్పుకోదగినవి నృత్యాలు. గోపీకృష్ణ, సంధ్య కలిసి చేసిన రాధాకృష్ణ, రతీ మదన, శివపార్వతీ నృత్యాలు, మేనకా విశ్వామిత్ర నృత్యం, భిల్ల నృత్యం, మయూర నృత్యం-ఇవన్నీ సామాన్య ప్రేక్షకులు కూడా ఆనందించదగిన శైలిలో వున్నాయి. ఏదో విధంగా నృత్యం ప్రవేశపెట్టని భారతీయ చిత్రమే ఉండదు. అలా ఏదో విధంగా నృత్యాలను ప్రవేశపెట్టిన ప్రతి చిత్రాన్నీ తిట్టుకోని ప్రేక్షకులుండరు. అలా కాకుండా ఈ చిత్రం ప్రత్యేకంగా నృత్యప్రధానమైన ఇతివృత్తం కలిగి ఉండడం చేత, ఎన్ని నృత్యాలు ఉన్నప్పటికీ అనవసరమనిపించలేదు. పైగా ఇతివృత్తమే అనవసరం అనిపిస్తుంది. ఇతివృత్తాన్ని పూరిగా లాగివేసి కేవలం నృత్య సన్నివేశాలతోనే చిత్రం తీసి ఉంటే బాగుండేదనిపిస్తుంది.

ఎందుచేతనంటే, ఈ చిత్రంలో ముఖ్యమైన 'బలహీనత కథలో ఉంది. ఇందాక చెప్పినట్లు బొంబాయి చిత్ర నిర్మాతలు ఇటీవలి కాలంలో నిర్మాణ శిల్పంపై చూపినంత శ్రద్ధ కథా శిల్పంమీద చూపించడంలేదు. కథలకు సంబంధించినంతవరకూ ఇతర భాషల చిత్రాలే హిందీ చిత్రాలకంటె మెరుగ్గా ఉంటున్నాయి. అందులో,



"ఝనక్ ఝనక్" లో సంధ్య

అపూర్వమైన శిల్ప నైపుణ్యం ప్రదర్శించిన "ఝనక్ ఝనక్." చిత్రంలో కథ శాంతారాం పేరు ప్రతిష్ఠలకు ఏ మాత్రమూ తగినది కాదు. మొదటినుండి చివరి దాకా అన్నీ అసందర్భాలూ, అసహజాలే. పాత్ర పోషణంలో కూడా చాల లోపాలున్నాయి. అనవసరంగా ఒక దుష్టబుద్ధి పాత్రను, హాస్య పాత్రలను ప్రవేశపెట్టారు.

కళాదర్శకత్వం ఎంత బాగున్నప్పటికీ, ఇప్పటి కాలంలోని కథకీ, ఆ కథలోని పాత్రలకు ఆ భవనాలూ, అవీ అతకడం లేదు. అలా కాక కథను ఏ మౌర్య, గుప్త చక్రవర్తుల కాలంలోనో పెట్టి ఉంటే ఆ బ్రహ్మాండమైన భవనాల వాతావరణాన్ని సమర్థించుకో డానికి వీలుగా ఉండేది. ఈ కథలో కళకూ ప్రేమకూ వైరుధ్యం లేదనేది ప్రధానమైన నీతి దీన్ని నిరూపించడానికి గాను బోలెడు కథ అల్లబడింది. నాయిక మామూలు చిత్రాల్లో నాయికలందరి వలెనే అనేక కష్టాలుపడి చివరికి నాయకుడు భారత నటరాజ్ బిరుదం కోల్పోయే సమయానికి సరిగా వచ్చి, అతనిని రక్షిస్తుంది. ప్రేమ పైన ఈ సంఘటనతో ఆ సత్యం నిరూపితమవుతుంది. ఇంతకంటె హృదయంగమమైన కథ ఉంటే ఈ చిత్రం అత్యుత్తమ చిత్రమై ఉండేది.

ఈ లోపాలన్నిటినీ కప్పి పుచ్చుతూ, శాంతారాం చక్కని చలన చిత్ర శిల్పాన్ని కనబరిచారు. ముఖ్యంగా నృత్య ఘట్టాలను చాలా జయప్రదంగా చిత్రించారు. ఈ నృత్యాలన్నీ కేవలం సాంప్రదాయికం అవునో కాదో తెలియదుగాని, అయినా కాకపోయినా, అవి చూస్తున్నంతసేపూ తన్మయత కలిగిస్తాయి. ఆఖరున, "జటాకటాహ సంభ్రమభ్రమన్నిలింప నిర్ఝరీ" అని శివతాండవ స్తోత్ర శ్లోకంతో ప్రారంభమయ్యే తాండవ నృత్యం ముఖ్యంగా ఎన్నదగినది. ఈ నృత్యాలకోసమే ఈ చిత్రాన్ని ఎన్ని సార్లయినా చూడవచ్చును.

—ఎన్నార్.

##  త్వరలో మరొక వర్ణ చిత్రం 

ఇంకొక టెక్నికలర్ చిత్రం త్వరలో నిర్మించబోతున్నానని శ్రీ వి. శాంతారాం ఇటీవల తన చిత్రం విడుదల సందర్భంలో మద్రాసు వచ్చినప్పుడు ప్రకటించారు. పత్రికా విలేఖరులతో ఇష్టాగోష్ఠి జరుపుతూ, తాను ఈ సారి నిర్మించే టెక్నికలర్ చిత్రం విచిత్రకల్పన (ఫాంటసీ) గా ఉంటుందని, అందులో కూడా భారతీయ నృత్య, సంగీత సంస్కృతికే ప్రాధాన్యం ఇస్తాననీ ఆయన చెప్పారు.

"ఝనక్ ఝనక్" చిత్రం నిర్మించడానికి దాదాపు 30 లక్షలు ఖర్చయిందని చెబుతూ "భారతదేశంలో టెక్నికలర్ చిత్రం నిర్మించడం సాహసమైనపని. మనకు సమర్థులైన టెక్నీషియన్లు ఉన్నారు. టెక్ని

"కృష్ణతులాభారం"లో రఘురామయ్య, ఎస్. వరలక్ష్మి



మద్రాస్, న్యూ వుడ్‌లాండ్స్‌లో ఈ నెల 14 వ తేదీన పత్రికా విలేఖరులతో ముచ్చటిస్తున్న నిర్మాత వి. శాంతారాం.

## ★ త్వరలో మరొక వర్ణ చిత్రం ★

కలర్‌కు తగిన ప్రకృతి దృశ్యాలు ఉన్నాయి. కాని లక్షలు వెచ్చించి తీసిన చిత్రానికి దాని పెట్టుబడిని దానికి రాబట్టే మార్కెట్ మన దేశంలో లేదు. టెక్నికలర్ చిత్రం మన దేశంలో అపారమైన విజయం పొందనన్నా పొందాలి, లేక ఇతర దేశాలకు ఎగుమతి అయి మరికొంత ధనం అధనంగా సంపాదించాలి. అంతేగాని సాధారణ విజయం పొందితే లాభం లేదు. ఈ కారణంచేత టెక్నికలర్ చిత్ర నిర్మాణం ఈ దేశంలో ప్రస్తుతం భారీ ఎత్తున సాగే అవకాశం కన్పించడం లేదు," అని ఆయన అన్నారు.

"మీ చిత్రంలోని నృత్యాలలో యూరోపియన్, చైనీస్ ప్రభావం అక్కడక్కడ కనిపిస్తోందని కొందరి అనుమానం. దానికి మీరేమంటారు?" అని ఒక విలేఖరి ప్రశ్నించగా "అది నిజం కాదు. అవి భారతీయ నృత్యాలే. కథక్ నృత్యం అలాగే ఉంటుంది" అని ఆయన అన్నారు. ఆఖరున చైనీస్ పద్మ నృత్యాన్ని పోలిన బృంద నృత్యాన్ని పేర్కొనగా "అది చైనీస్ నృత్యం అని ఎందుకనుకోవాలి? చైనీయులే మననుండి గ్రహించి ఉండవచ్చును. దీపపు సెమ్మెలను పోలిన వేషాలతో వచ్చి నృత్యం చేస్తే అది చైనీస్ ఎందుకవుతుంది" అని సమర్థించుకున్నారు.

చిత్రంలో ఒక విషాద సన్నివేశంలో ప్రవేశపెట్టిన పాట అనవసరం కాదా అని ఒకరడిగారు. "అవును. అటువంటివి కొన్ని లోపాలు ఉన్నమాట నిజమే. కాని నేను కొన్ని అందమైన అంశాలను, కొత్తవాటిని ఈ చిత్రంలో ప్రవేశపెట్టాను. ఆ కొత్త వాటిని చూసైనా, పాతవాటిని సహించవలసిందిగా కోరుతున్నాను. అంతర్జాతీయముగా యీ చిత్రాన్ని విడుదల చేసేటప్పుడు అనవసరమైన భాగాలను తొలగిస్తాను," అని శాంతారాం చెప్పారు.

ఝనక్ ఝనక్ చిత్రాన్ని టెక్నికలర్ కెమెరాతో 'షూట్' చేయలేదని, ఈస్టుమన్ కలర్‌లో ముందు షూట్ చేసి, ఆతరువాత దానిని టెక్నికలర్ ఫిలింమీదికి మార్చామనీ, ఈసారి తీయబోయే చిత్రాన్ని పూర్తిగా టెక్నికలర్ కెమెరాతోనే షూట్ చేస్తామని ఆయన చెప్పారు. వేరేఫిలింమీద తీసినా, టెక్నికలర్ ఫలితాలు యథాతథంగా వచ్చినందుకు ఛాయాగ్రాహకుడు నిజంగా ప్రశంసనీయుడు.

ఇష్టాగోష్ఠి తరువాత ట్రాన్స్వే టాకీస్ యజమానులు శాంతారాం గౌరవార్థం వుడ్‌లాండ్స్‌లో అల్పాహారవు విందు చేశారు.

## బొంబాయి సినిమా లేఖ

గీతాబాలి, అజిత్, ప్రాణ్, చంద్రశేఖర్ మున్నగువారు నటించిన "బారాదరి" చిత్రం ఈనెల 14-వ బొంబాయిలో విడుదల అయింది. కథ, దర్శకత్వం దెబ్బతిన్నవి కాని నటులందరూ, ముఖ్యంగా గీతా, చంద్రశేఖర్ బాగా నటించారు. సంగీతం చాలా ఆహ్లాదకరంగా ఉన్నది. రాజపుత్ర జాతి శౌర్యగుణాన్ని సరిగ్గా చూపించలేదు.

పెట్టులు, ఫోటోగ్రఫీ, నృత్యాలు మొదలైన ప్రొడక్షన్ విలువలు సర్వసాధారణంగా ఉన్నాయి

* * * *

భారతి ఫిలిం ఫెడరేషన్ అధ్యక్షుడు ఎస్. ఎస్. వాసన్ ప్రొడ్యూసర్స్ గిల్డులో చేరారు. ఆయన ఇటీవల బొంబాయి వచ్చినప్పుడు భారత్ భూషణ్‌ను చూడడానికి "బసంత్ బహార్" చిత్రం సెట్స్‌ను సందర్శించారు. వాసన్‌గారి "ఇన్సానియత్" లో నటించడానికి మొదట భారత్ భూషణ్ బుక్ అయ్యాడు. తరువాత మొత్తం తారాగణం అంతా మార్చివేయబడింది. తమ తరువాతి చిత్రంలో నటించవలసిందని వాసన్ భారత్ భూషణ్‌ను చాలాసార్లు కోరినా, అతడు అన్నిసార్లూ నిరాకరించాడు. ఎలాగైనా యీసారి తమ చిత్రంలో భారత్ భూషణ్ నటించేటట్లు చూడాలని వాసన్ పట్టుదలగా ప్రయత్నిస్తున్నారు. వాసన్, భారత్ భూషణ్‌లకు ఏ విభేదాలున్నా అవి సమసిపోయి కనీసం ఒక చిత్రానికైనా ఇద్దరూ కలిసి పనిచేయడం మంచిది. వీరిద్దరి విభేదాలు బొంబాయి ఫిలిం వర్గాలలో రాష్ట్రీయ సంకుచితత్వాలు కలిగించేవరకూ పోవటం శోచనీయం.



"(శ్రీ) 420" బొంబాయిలో విడుదలైనప్పుడు రాజ్‌కపూర్‌ను కౌగిలిస్తున్న దిలీప్ కుమార్.



పి. ఎల్. సంతోషి నిర్మిస్తున్న "గర్మా గరమ్" చిత్రంలో నదీరా, ఆగా

* * * *

హాలీవుడ్ తారలలోను, గాయకులలోనూ అగ్రగణ్యులైన కొందరు ఈ ఏడాది డిసెంబరు ప్రాంతాల్లో బొంబాయి, ఢిల్లీ నగరాలకు వచ్చి వివిధ ప్రజాహిత నిధులకు ద్రవ్యం సేకరించడానికి వినోద ప్రదర్శనలిస్తారని హాలీవుడ్ "వెరైటీ ఇంటర్నేషనల్" మేనేజరు జాన్ హాస్కెల్ ఇటీవల బొంబాయిలో వెల్లడించారు. హాలీవుడ్ తార మెరిలిన్ మన్రో, గాయకుడు ఫ్రాంక్ సినాట్రా, మెరిలిన్ మాక్స్‌వెల్, బేస్‌బాల్ నిపుణుడు అయిన జో డిమాగియో, లిలీ పాన్స్, నాట్ కింగ్ కోల్, ప్రసిద్ధ డెవ లింగ్ క్రాస్బీ మున్నగువారు ఆ సందర్భంలో వస్తారట.

(ఆంధ్ర-వారపత్రిక బొంబాయి విలేఖరి)





"తెనాలి రామకృష్ణ" సెట్సు సందర్శించిన అశోక్ కుమార్, నిరూపా రాయ్, కమల్ రాయ్, దర్శక నిర్మాత బి ఎస్. రంగా, భానుమతి, ఎన్ టి రామారావు తదితరులు.

## ప్రేక్షకుల అభిప్రాయాలు
## "దొంగరాముడు"

ఆర్. నాగేశ్వరరావుగారి నటన చెప్పుకోతగ్గది ఏ నాగేశ్వరరావుగారు కూడా చతురతతో నటించారు పటుత్వంగల కథ, ఆరితేరిన నటవర్గం, అద్భుతమైన దర్శకత్వం, నేటి జీవితవిధానంలో ఉండే వాస్తవికతను కె వి రెడ్డిగారు చక్కగా చూపించారు ఎంగులోకల్లా "ఒకే తాత మన బాపూజీ బాలల తాత బాపూజీ" అన్న పాట చాల బాగుంది స్వంటు కొంచెం అతి అయింది.

ఎమ్. బి పూర్ణచంద్రరావు,
—విజయవాడ.

భద్రయ్య తన చెల్లెలి పెళ్ళి ఆపటాన్ని పూనుకొని బయలుదేరుతున్న సమయానికి రాముకు కత్తి చూపించి దడిపిస్తాడు ఆ సమయానికే గడియారం గంటలు కొడుతుంది ఇది విజయవడానికి సూచనగా భద్రయ్య భయపడతాడు ప్రేక్షకులు కూడా రాముడు చేతే భద్రయ్య చంపబడి చివరికి కథ విషాదాంత మవుతుందని భావిస్తారు కాని భద్రయ్య యింకొకడిచేత ఖూనీచేయబడతాడు ఈ ఘట్టం సరసరానిది

దర్శకత్వంలో కొన్ని లోపాలు కూడా లేకపోలేదు ఉదాహరణకు భద్రయ్య సెబ్బు గొలుసు, చీర పోయినప్పుడు చీర, గొలుసు రాముడిదగ్గర దొరుకుతాయి ఇంతేనా పోయిందని భద్రయ్యని పోలీసులు అడుగుతే 'యింతే' నంటాడు డబ్బు సంగతి చెప్పటం మరచిపోతాడు ఇదొక లోపం లక్ష్మి తన చిన్నప్పుడు తన అన్నయ్యతో కలసి పాడిన పాటని డాక్టరుగారింట్లో పిల్లలవద్ద పాడుతుంది ఆ సమయంలో ఆమె వదనంలో విచారరేఖలైనా కనిపించకపోవటం ఇంకొక లోపం ఈ లోపాలు కథాగమనానికి అడ్డురావు ★

అండలూరి వీరజోగారావు —
విజయనగరము

* * *

ఎన్నాళ్ళనుంచో ఎదురు చూస్తున్న 'దొంగరాముడు' చిత్రం నేటికి ఆంధ్రదేశంలో విడుదలయింది చిత్రం నిడివి కొంచెం తగ్గించితే బాగుండేది అయినప్పటికి కథంతా హాస్యధోరణిలో నడిచింది అందువలన ప్రేక్షకులకు విసుగనిపించలేదు. దొంగరాముడుగా నాగేశ్వరరావు తన శక్తి

నాయుర్వేదాలను, నటనా కౌశలాన్ని యీ చిత్రంలో చూపాడు. సావిత్రి 'సీత' గా చక్కగా నటించింది. ఆర్. నాగేశ్వరరావు నటన ఏమంత చెప్పుకోతగ్గది కాదు. జమున, జగ్గయ్య, రేలంగి, వంగర మొదలగువారు తమతమ పాత్రలను అర్థం చేసుకొని చక్కగా నటించారు. వంగరగారి 'నీ బొంద,' 'నా బొంద' అనే మాటలు ఆనందాన్ని చేకూర్చాయి. బాలకృష్ణ, పద్మనాభాలు అనవసరం. సముద్రాల పాటలు, డి. వరసరాజా మాటలు బాగున్నాయి. పాటల్లో ఒకటి రెండు తప్ప మిగిలినవన్ని ఏమీ బాగా లేవు. డైరెక్టరు కె. వి. రెడ్డిగారు, నిర్మాత మధుసూదనరావుగారు అభినందనీయులు.

బుర్రా ముకుందకృష్ణమూర్తి —
వేటపాలెం.

"దొంగరాముడు" చాల బాగున్నది. కథ కూడ బాగుంది. కొన్ని పాటలు బాగున్నాయి. నాగేశ్వరరావు బాగా నటించాడు. నాగేశ్వరరావుకి రాముడు పాత్ర బాగా నప్పింది. సావిత్రి, జమున, సూర్యకాంతం బాగానే నటించారు. పాటలన్నిటిలో "బలేతాత బాపుజీ! బాలలతాత బాపూజీ" అన్న పాట చాల బాగుంది. ఈ చిత్రం తప్పక ప్రజాదరణ పొందగలదు. ఈ చిత్రం శతదినోత్సవం చేసుకొనచ్చునని ఆశించుచున్నాము.

చావలి భాస్కరరావు—కాకినాడ.

* * *

"దొంగరాముడు" చిత్రం అనుకున్నంత తృప్తికరంగా లేదు. కొన్ని అసహ్యకరమైన సన్నివేశాలు ఉన్నప్పటికీ చిత్రము వరసరాజుగారి మాటల మూలంగా కొంత వరకూ వన్నెకొచ్చినది. నటీనటులలో చిన్న రాముడుగా నటించిన మాష్టరు శర్మ చాలా ప్రతిభావంతముగా నటించాడు. నాగేశ్వరరావు నటన ఎక్కువ తృప్తికరంగా లేకపోయినప్పటికి మొత్తముమీద బాగానే నటించాడని చెప్పవచ్చు. జగ్గయ్య, జమున, రేలంగి, రామన్న పంతులు చాల చక్కగా నటించారు. సముద్రాలవారి పాటలు, పెండ్యాలవారి సంగీతము చాల బాగున్నవి. ఇంకనూ ఒకటి రెండు పాటలు ఉన్నా పరవాలేదు. సావిత్రి రాణించుటకు అవకాశములు తక్కువ.

జ. లింగమూర్తి
—అమలాపురం.

## సినిమా వార్తలు

ప్రతిభా పిక్చర్స్‌వారు ఈసారి ఒక సాంఘిక చిత్రం నిర్మిస్తున్నారు. ఇందులో నాగభూషణం, జానకి, గుమ్మడి, వంగర, జోగారావు, అల్లు రామలింగయ్య, పి. హేమలత మున్నగువారు నటిస్తున్నారు. దర్శకుడు ఎస్. బాలచందర్, సంభాషణలు, పాటలు సుంకర సత్యనారాయణ. సంగీత దర్శకుడు వేణు. ఒక సెట్ మీద పని పూర్తయిందని తెలుస్తోంది. స్టూడియో వీనస్. ఈ చిత్రానికి ఇంకా పేరు పెట్టలేదు.

* * *

విజయావారి "మిస్సమ్మ" చిత్రాన్ని హిందీలో నిర్మించడానికి ఎ. వి. ఎమ్. వారు హక్కులు కొనుక్కున్నారట. నాయక పాత్ర కిశోర్ కుమార్ ధరిస్తాడట. మాటలు, పాటలు రాజేంద్రకృష్ణ, సంగీతం హేమంత కుమార్. * * *

చైనాలో జరుగుతున్న భారతీయ చలనచిత్రోత్సవంలో పాల్గొనడానికి పృథ్వీరాజ్ నాయకత్వాన బి. ఎన్. సర్కార్, బిమల్ రాయ్, చేతన్ ఆనంద్, రాజాపరంజ్పే, కామినీకౌశల్, బల్‌రాజ్ సాహ్నీ, కృష్ణగోపాల్, కృష్ణచందర్, జగత్ మురారీ వెళ్లారు. * * *

టాకీ చిత్రాల రజతోత్సవం వచ్చే మార్చిలో దేశమంతటా వైభవంగా జరపడానికి ఫిలిం ఫెడరేషను నియమించిన ఉత్సవ సన్నాహసంఘం నిశ్చయించింది. ఈ డిసెంబరులో జరపడానికి ఇదివరలో జరిగిన నిర్ణయం మార్చబడింది. ★



"బాద్షా సలామత్" హిందీ చిత్రంలో అమరనాథ్, శ్యామలి బిశ్వాస్.



"బాప్ రే బాప్" చిత్రంలో కిశోర్ కుమార్, చాంద్ ఉస్మానీ.

Printed and Published for Nageswara Rao Estates Ltd, by S Radha Krishna at The Andhra Patrika Press 6 & 7 Thambu Chetty Street Madras 1 Editor S Sambhu Prasad